శ్రీ

విద్యాప్రవీణ

జమ్ములమడక మాధవరామ శర్మ

వైస్ ప్రిన్సిపాల్, సాహిత్యాలంకార పండితుడు,

భాషావాఙ్మయ చరిత్రోపన్యాసకుడు, సంస్కృతకళాశాల,

తెనాలి

*

ప్రకాశకులు :

శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవీస్థానము కమిటి

తెనాలి

1941

జమ్ములమడక మాధవరామ శర్మ
ఉపాధ్యాయుడు - సంస్కృతకళాశాల,
తెనాలి



ప్రకాశకులు :
శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవీస్థానము కమిటీ
తెనాలి

[వెల ౧-౪-౦




జమ్ములమడక మాధవరామ శర్మ

ఉపాధ్యాయుడు - సంస్కృతకళాశాల,

తెనాలి





ప్రకాశకులు :

శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవీస్థానము కమిటీ

తెనాలి.

[వెల ౦-౪-౦

మా ఈ శ్రీ విమర్శ

శ్రీదేవీచరణసహస్రపత్రశ్రీ

శ్రీవరివస్యాలక్ష్మి



గ్రథయిత

జమ్ములమడక మాధవరామ శర్మ

శ్రీ

# పీఠ భా ర తి

విశ్వమంతయు దేవీవిలాసముతో శోభించుచున్నది. దేవీస్వరూపము నానాస్వభావములలో భాసించుచున్నది. ప్రపంచమంతయు నేదేని విధమున పరాశక్తి నారాధించుచున్నది. శ్రీదేవీతత్త్వమును భారతభూవాసులు హృదయమున ధరించినారు. బహిరావిష్కార మొనరించుకొనినారు. విశ్వమునం దారోపించికొని యారాధించినారు. ఇతర దేశీయులు భారతీయులవలె శక్తి ప్రభావవిశేషముల నవగాహము చేసికొనలేదు. భారతదేశమునందు వస్తుసముదాయమంతయు దేవీస్వరూపముగా భావింపబడుచున్నది. దేవ్యాయతనములనేకములు వెలయుచున్నవి. భారతదేశమున నానావిధముగ పూజాసంప్రదాయములు శోభించుచున్నవి.

ఆంధ్రదేశమునందలి భక్తులనేకులు దేవీతత్త్వము ననేక విధముల నుపాసించుచున్నారు. వారందరును ధన్యులు. ఇతరులకును ధన్యత్వము నాపాదించుటకు దేవ్యుపాసకు లొనర్చిన విశిష్టచిహ్నము లనేకములున్నవి. అట్టి దేవీమందిరముల నారాధించి భక్తిభావముల నతిశయింప చేసికొనినవారలనేకులున్నారు.

వైశ్యచూడామణుల వంశమందు శ్రీ పరమేశ్వరి కన్యకగా సాక్షాత్కరించినది. కన్యకాస్వరూపమున శోభించిన శ్రీదేవిని వైశ్యు లారాధించుచున్నారు. ఆరాధింపజేయుచున్నారు. చక్కని సంపద్విభవములతో శ్రీ కన్యకాపరమేశ్వరిపూజలు తెలుగునాట విరాజిల్లుచున్నవి. వీని శోభాసమృద్ధివలన సామాన్యజనులకును దేవీశ్రద్ధ యతిశయిం

చినదనుట సత్యదూరముకాదు. ఇందు వైశ్యులుత్సుకు లగుట హేతువు. వారిపై లోకము కృతజ్ఞభావమును సూచింప వల యును. అట్టి వైశ్య శ్రేష్ఠులకు నాధన్యవాదములు.

ఆంధ్రదేశములో శ్రీకన్యకాపరమేశ్వరీ మహోత్సవము లతివైభవముగా జరుగుచున్నవి. మా యీ తెనాలిపట్టణ మున జరుగు మహోత్సవములందు విశిష్టతయున్నది. ఈవిశే షమును జూచి సంతసించువార లనేకులున్నారు. ఇచటి యుత్సవములు ఆదర్శరూపమున నున్నవి. కొందరు వీని ననుసరించు చున్నారు.

తెనాలి కన్యకాపరమేశ్వరీ మహోత్సవములు సర్వ సామాన్యముగా దేవీశ్రద్ధను సంపాదించుచున్నవి. పరమేశ్వరి ఆలయమునకు సంబంధించిన సత్రము సన్నిహితముగా నుండుట, అందు దేవీప్రభావ ప్రసారములను విశదము చేయు వివిధోపన్యాసములు కావింపబడుట, వేలకువేలుజను లపార ముదము వహించుచున్నారు. ప్రస్తుతము దేవీభక్తులయిన వైశ్యప్రముఖులు దేవీమందిరమును సత్రమును పూర్వాధిక మనోహరముగాజేసి కన్యకామహోత్సవముల జేయించు చున్నారు. ఈవిషయమున అచటి కమిటీవర్గమును అందలి కార్యదర్శులును నిర్వాహకులును ప్రశంసింప దగియున్నారు. శ్రీదేవీమహాత్మ్యమును వెల్లడించు విశిష్టపూజలు వైశ్యభక్తు లచే జేయింపబడుచున్నవి.

శ్రీదేవీదీక్షానమస్యా భావనానుత్తరాధికారిత్వమును సంపాదింపజేసిన శ్రీశ్రీశ్రీ ౧౦౦౦వ జగద్గురు శ్రీ కల్యా ణానంద భారతీమాంతాచార్య మహాస్వామి పాదుల మహా

దేశనాకటాక్ష ప్రసృతి ఆత్మశ్రీ విమర్శప్రకాశభావమున హేతువు. వినేయుల వినయభావమున ప్రాతఃస్మరణీయపాదులు మహాదేశికోత్తముల మనుబీజములు బీజము. తదంతర్నిమేషము సమున్మిషితముకాగా నేనుత్సుకత్వము వహించితిని.

ఇచటి వైశ్యధర్మనియుక్తుల ప్రోత్సాహము ననుసరించి పరమేశ్వరీ సన్నిధానమున నవరాత్రములందు నేను శ్రీదేవీ వరివస్యావిశేషముల నుపన్యాసరూపమున జెప్పితిని. అవి గ్రంథరూపముగా నుండవలయుట మా యనేకసామయిక మిత్రులకోరిక. ఆయుపన్యాసముల సారాంశము 'శ్రీ'రూపము వహించినది. దేవీభక్తుల కందుబాటులో నుండుటకై దేవీస్థానపు కమిటీవారు దీని ముద్రణవిధాభారమున సాహాయ్యపడి నావిమర్శకు ప్రకాశమిచ్చినచేతస్త్వమును విశదముచేసినారు. కమిటీవారి యిట్టి సత్సంకల్పము ఆదర్శప్రాయమై విశిష్టభావమును ప్రకటము చేయుచున్నది. శ్రీకన్యకాపరమేశ్వరీదేవి యిత్తోధిక సంపత్సమృద్ధులను సంపాదింపజేయుగావుత మని సాంజలినై సంప్రార్థనము చేయుచున్నాను.

శ్రీభారతీపరస్పర సామరస్యము లోకకళ్యాణభిక్ష. మా 'శ్రీ'కి మా యీ తెనాలి 'భారతి' బాసటయై యనతికాలమున చక్కని రూపసంపదనిచ్చినది. 'భారతి' శ్రీ ప్రకాశమున వెలయుగావుతమని యభిశంసనమును గలుపుకొనిన సమరసమగు వినయవచోరీతి ననుగమించిన నానమోవాకము.

వృష. భాద్రపద
కృష్ణ షష్ఠి శుక్రవారము
12—9—1941

శ్రీ మాధవరామ శర్మ.

మా యీ శ్రీ ప్రకాశసమున్మేషమునకు

౧ అస్మన్మహాదేశికులు జగద్గురు శ్రీకల్యాణానంద భారతీ మాంతాచార్య మహాస్వామి పూజ్యపాదుల కటాక్ష ప్రసృతి

౨ శ్రీదేవీనిత్యానుగ్రహము

3 అస్మదీయమగు ఆత్మశ్రీసంస్కారము

౪ మా పితృపాదుల వాత్సల్యభరము

౫ శ్రీదీక్షాదత్తుల సంవాదభరవరభాషితములు

౬ ధార్మికపత్రికల కల్యాణసందేశములు

౭ తాంత్రికగ్రంథార్థములు

౮ అస్మద్గురుచరణసముపదిష్టతంత్రజ్యోత్స్నాదులు

౯ శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవీనిలయ ధర్మశాల నాధికారనియుక్తులు తెనాలి వైశ్యసహృదయులు అను నవకము మూలాధారము

ఆదరముతో శ్రీ గ్రంథప్రకాశకులు శ్రీ విషయమునగల సకలాధికారములను మాయాయత్తము చేసినారు. మఱల శ్రీ ముద్రణమభిలషించువారు నన్నడుగవలయును.

శ్రీ మాధవరామ శర్మ
వైస్ ప్రిన్సిపాల్,
సంస్కృతకళాశాల, తెనాలి.



శ్రీ తత్త్వమును తెలియుట మానవునకు పరమావశ్యకము. తత్త్వము తెలియవలయునని యనెడి ఆసక్తి అంతరంగమున అతిశయించినపుడే మానవు డుత్తమ సాధనములను స్వీకరించును. అనేక జన్మములందు పుణ్యపరిపాకము ఉన్నప్పుడు గాని తగిన శ్రద్ధ ఉదయింపదు. శ్రద్ధకలిగినను తెలియవలసిన దానిని తెలియుటకు మానవుడు అర్హతావిశేషమున్నప్పుడు గాని ప్రయత్నింపడు. శివకేశవాదుల ఆరాధించు మానవులుకూడ ఎంతయో పరిశుద్ధత కల్గిననాడు గాని శివకేశవాదుల తత్త్వము తెలియుట కభిలాషపడరు. స్వభావసిద్ధముగా మొదటగా స్వదేవతాభిమాన మధికముగా నుండును. అట్టి భావము విచారణలో వడపోతపోయబడినప్పుడే పరిశుద్ధము కాగలదు. ఆసమయమున తాను ఇతరదేవతల ప్రాధాన్యమును నిరసింపడు. ఇంకను విశిష్టమగునట్టి అర్హతను సంపాదించిన పిమ్మట సకలదేవతలను స్వదేవతగా భావింపగలడు. ఇట్టి ఉత్తమ భావము కల్గినపిమ్మటనే పరమేశ్వరీ విలాసము తెలియుటకు ప్రారంభించును. ఉత్తమోత్తమ భావనిర్మలత కల్గినప్పుడు దేవీపూజాదులలో న్యాసజపములలో అభిలాషకలవాడగును. అట్లు శ్రద్ధాయుక్తుడై ఆరాధించగా అనుత్తమమగు అర్హతకల్గుట సహజము. ఆ సమయమున ఆతని అంతరంగ వృత్తులన్నియు శ్రీ తత్త్వమును



మాధవ

శ్రీ

తెలియుటకు ఏకోన్ముఖములగును. పరదేవీస్వరూప రహస్యము తెలిసినప్పుడే పరమానందము ప్రాప్తించుట ప్రామాణికులలో ప్రసిద్ధమై యున్నది. ప్రపంచమున గోచరమగు నట్టి పదార్థమంతయు బ్రహ్మరూపమే. సాధకుల చిత్తావలంబమునకై పరమాత్మ అనేక విభూతులను కల్పించి యున్నాడు. సర్వవిభూతులందును పరబ్రహ్మ సమరూపముననే భాసించును. దర్పణము మణి జలము మొదలగు ఉపాధుల శుద్ధితారతమ్యానుసారముగా బ్రహ్మస్ఫురణములో కూడ తారతమ్యము భాసించును. ఉపాధిభేదమున ప్రతిబింబము భిన్నమైయుండుట సహజధర్మము. ఈ తరతమ భావము ఉపాధిగతమే కాని బ్రహ్మగతము కాదు. ఆ బ్రహ్మస్ఫురణ తారతమ్యము ననుసరించి విభూతులలో తారతమ్యముత్పన్నమగుచున్నది. ఇయ్యది పరమార్థశాస్త్ర సిద్ధాంతము. ఆ యా ఉపాధులతో కూడుకొనిన బ్రహ్మచైతన్యము లోకమునకు ఉపాస్యము. ఏకైకగుణములు ఉపాధిగా పొందిన శివకేశవాదులు ఉపాస్యతరులు. గుణత్రయముయొక్క సామ్యావస్థను ఉపాధిగా చేసికొని శ్రీభగవతి మహామాయాస్వరూపిణి సర్వోత్తమ విభూతియై రాజిల్లుచున్నది. ఆ భగవత్ విభూతిని ఉపాసించుటయే ముఖ్యము. ఈ విషయమై ఆగమశాస్త్రములలో విస్తృతములగు విశేషములున్నవి. ఈ విధముగా అఖిలభారతవర్షమున దేవి ఉపాసనా సంప్రదాయము అత్యంతము ప్రాచీనమై యున్నది. ప్రబలమై ప్రకాశించుచున్నది. అంతేకాదు శైవ వైష్ణవాది

మాధవ

సంప్రదాయములలోకూడ శక్త్యుపాసన అఖండరూపముతో అనుస్యూతమై యున్నది. సూక్ష్మేక్షికతో పరిశీలించినప్పుడు ఈవిషయము విస్పష్టము కాగలదు. ప్రస్తుత విషయమును సాంగోపాంగముగా ప్రతిపాదించుటలో పురాణ తంత్రాది గ్రంథములు అనేకములు ప్రసిద్ధములై యున్నవి.

పరమేశ్వరుని ఆనందమయశక్తియొక్క స్వరూప బోధకములైన మంత్రములు వేదమున అనేకములు గలవు. ఈ అఖండానంద చైతన్యమును స్ఫురితముచేయు శక్తికి 'అదితి' అని రహస్యనామముంచబడినది. ఆ అదితియే సర్వదేవతయై కన్పడుచున్నది. ఆ అదితి గంధర్వ మనుష్య పితృదేవతాసురులకు సంపూర్ణభూతములకును శ్రీ మాతగాచెప్పబడుచున్నది. ఆ శ్రీశక్తి విశేషము పృథివి సావిత్రి గాయత్రి సరస్వతి మొదలగు నామములచే స్పష్టముచేయబడినది. ఆ అదితి స్వరూపమును విమర్శించి ప్రకాశింపచేయు పుత్రులకు ఆదిత్యులని పేరు. ఆ అదితికి దితి విరోధిని. ఆ అదితి పుత్రులు దైత్యులు. అదితి దితి విరుద్ధ. దైత్య విరుద్ధులు ఆదిత్యులు. అసురవిరుద్ధులు సురులు. ఇట్లనేకరూపకములు ద్వారా శక్తి పాశమున లగ్నులగు వారియొక్కయు శక్తి పాశములను విచ్ఛేదము చేసికొనువారియొక్కయు పరాక్రమములు సవిశేషముగా వర్ణింపబడినవి. సర్వాంశమున సర్వశక్తులకును అదితియందు మాతృభావము కూర్పబడినదని సారాంశముగా గ్రహింపవచ్చును. ఉషోదేవికి సంబంధించిన చమత్కృతికల సూక్తములో శక్తికి సంబంధించిన కుమారీ



మాధవ

భావము చక్కగా చిత్రింపబడినది. ఇట్లే ఋగ్వేదమున శ్రీ శక్తివాదమును స్థాపించునట్టి సూక్తము లనేకములు కలవు. యజుర్వేదమునకు సంబంధించిన అగ్నిరహస్య కాండములో యజ్ఞవేదికపై ఇష్టికములను పరచునట్టి మంత్రములలో శ్రీ విభూతి చెప్పబడుచున్నది. ఈ జగత్తును ఉత్పాదించునట్టి సర్వప్రార్థనీయమగునట్టి విచిత్ర చిచ్ఛక్తిని సుమతిపదముచే చెప్పతగిన విశ్వజన్యను నేనే. ఆద్యశక్తి ఏకవిధమే. అయినను బహురూపమైనది." "ఈ అర్థముతో అచటి సంవిధాన రమణీయత భాసించుచున్నది. ఒకప్పు డంతటను అజ్ఞానాంధకారమే ఆవరించినది. అప్పు డహోరాత్రముల భేదములేదు. అప్పుడు జగత్కారణము అభివ్యక్తము కాలేదు. అసత్పదార్థమును లేదు. కేవలము బ్రహ్మయే శాంతశివరూపమున స్థిరమైయుండెను. అప్పుడు జగమునంతను ఉత్పాదించునట్టి పవిత్రము ప్రార్థనీయమగు అక్షర తేజము ఉన్ముఖమైనది. దానినుండి సనాతన ప్రజ్ఞ అనగా స్ఫురణ ప్రకటమైనది. ఈవిధమున శ్వేతాశ్వతరశాఖలో చెప్పబడుచున్నది. ఛాందోగ్యములోకూడ పరదేవతయందు లీనమగుట శ్వేతకేతూద్దాలక సంవాదములో చెప్పబడినది. వేదములు సంహితలలో దేవతామయి యగు శక్తియొక్క స్పష్టమగు ఉపాస్యత్వము ప్రకటితమైనది. బ్రాహ్మణములలో ఆరణ్యకములలో బ్రహ్మచైతన్యముయొక్క శుద్ధశక్తి గాయత్రి సావిత్రి సరస్వతి మొదలగు నామములతో వ్యవహరింపబడినది. బ్రహ్మస్వరూపమును గాయత్రీ మంత్రగాన ద్వార

మున రక్షణచేయు శక్తికి గాయత్రి అనిపేరు. ఆ అధ్యాత్మ తేజస్సును భర్గసంజ్ఞతో వ్యవహరించుటయు కలదు. గాయత్రీ దేవియే భరణ రమణ గమనము లొనరించునప్పుడు భర్గమయి తేజోమయి జ్యోతిర్మయి మొదలగు నామములచే వ్యవహరింపబడినది. విశ్వమంతయు ఆదేవినుండియే ఉత్పన్నమైనది. అందువలన గాయత్రి సావిత్రి యగుచున్నది. ఆ దేవియందు బ్రహ్మనందము ప్రవాహవిధమున ప్రసరించుటచే సరస్వతీ నామము సముచిత మైనది. ఆ బ్రహ్మశక్తి ప్రాణమయి జీవనమయి ఆనందమయి అగుటను బ్రహ్మస్వభావ ధర్మములను ప్రకటన చేయునది అగుటను సచ్చిదానందమయి అనబడుచున్నది. గాయత్రి పేరు కల బ్రహ్మశక్తి త్రిలోకరచన చేయునదియైనను ఈలోకత్రయము నతిక్రమించి యున్నది. ఆదేవి వేదత్రయ సారరూప వేదరహస్యజ్ఞానప్రదాత్రి.

శ్రీశక్తి మిథ్యారూపము కాదు. అగ్నియందలి దాహప్రకాశశక్తులవలె వాస్తవస్వభావము. బ్రహ్మకు సంబంధించిన స్వభావధర్మమే ఆశక్తిరూపము. ఇది పరమాత్మ యొక్క స్వయంభూ దివ్యశక్తి. శ్వేతాశ్వతరోపనిషత్తులో ఈ ఆద్యశక్తియే మూడు విధములుగా విభాగింపబడినది. జ్ఞానశక్తి ఇచ్ఛాశక్తి క్రియాశక్తి. ఈ పారిభాషిక నామములు వేదాన్తశాస్త్రమున ప్రసిద్ధములై యున్నవి. బీజబిందు నాదములు తంత్రశాస్త్రములోని శక్తివాదమునకు సంబంధించిన పారిభాషిక నామములు. వ్యాకరణ శాస్త్రముయొక్క శబ్దబ్రహ్మవాదములును శాక్తవాదమునకు ప్రాథమిక రూప



మాధవ

ములు. బీజబిందు నాదాంశములను సూచించునది పరాశక్తి. ఈసంపూర్ణ ఆకృతికి అధిష్ఠానదేవత యగు దేవి త్రిపుర యన బడుచున్నది. దీని సర్వాంశ వివరణము ప్రస్థానమును శ్రీ విద్యలో సుస్పష్టము. ఈ త్రిపురధామములో అధిష్ఠానముగా నున్న పరాదేవియే ఆరణ్యక గ్రంథములలో సుభగసుందరి అంబిక మొదలగు నామములచే వ్యవహరింప బడుచున్నది. ధర్మార్థ కామములను ఐశ్వర్యధర్మయశః శ్రీజ్ఞాన వైరాగ్యము లను దివ్యగుణములను ప్రధానము చేయునదియగుట సుభగ యనబడును. ఉపాసనావర్ణన మొనరించునట్టి సౌభాగ్య కాండ అథర్వవేద భాగముగా చెప్పబడుచున్నది. అచట నున్న మంత్రములలోని మూలార్థము యజ్ఞవిద్యావిషయము ముగా నున్నప్పటికి వాని ఆధ్యాత్మికార్థము దేవి ఉపాసనా విషయికముగనే యున్నది. ఆమంత్రములతో సంబంధముగల పరశురామ కల్పసూత్రము ఆ అనుష్ఠానపద్ధతిని సూచించును. ఇట్టి వనేకములు ఉపలబ్ధము లగుచున్నవి. జగదుత్పాదనము చేయు బ్రహ్మశక్తికి త్రిపుర యని పేరు. పరవస్తుబోధను కల్గు చేయునది అగుటవలన ఈనామము సార్థకము. శ్రీ విద్య అని రెండవ పేరు. బ్రహ్మచైతన్య స్వభావధర్మమైన శ్రీ శక్తిని బోధించునట్టి ఉపనిషత్తు లనేకములు కలవు. త్రిపుర త్రిపురాతాపిని దేవి బహ్వృచభావన సరస్వతీ హృదయ సీతాసౌభాగ్యలక్ష్మి కాంతితార అద్వైతభావ అరుణకాల శ్రీవిద్యాలంకారము లనెడు ఉపనిషత్తులు శ్రీ స్వరూప ప్రతిపాదకములు. కాళికాల శ్రీవిద్యాతారకములు

శ్రీ

తంత్రశాస్త్రము లుదయించినపిమ్మట నుత్పన్నములైనట్లుగా విమర్శకులు తలచుచున్నారు. తదితరోపనిషత్తులు వాని మంత్రములు బ్రాహ్మణములందు కన్పడుటచే అవి వేదభాగములనుటలో సందేహము లేదు. త్రిపురతాపినీ ఉపనిషత్తులో శ్రీవిద్యా పంచదశాక్షరీ మహామంత్రము ఉదాహరింపబడినది. దేవీపూజలోని స్థూల సూక్ష్మపద్ధతులు అందు వివేచింప బడినవి. గాయత్రీమంత్రమునకు శక్తివాదముననే తాత్పర్యముండుట ప్రతిపాదింప బడినది. ఇట్లే ఇతరములగు ఉపనిషత్తులలో సాధారణముగా ఈవిషయము ప్రతిపాదితము. శ్రీవిద్యా పంచదశీ మహామంత్రము నిరూపింపబడుట శక్తి సంప్రదాయములోని కాదిహాది విద్యలయొక్క స్వరూపమును వివేచించుట పరబ్రహ్మను లలితారూపమున ధ్యానించుట దేవియొక్క పరస్వరూపముయొక్క వర్ణనము శ్రీవిద్యకు అధ్యాత్మనవచక్రమున దేవీఉపాసననావిశేషములు నిర్దిష్టములైనవి. శ్రీ పంచదశాక్షరీ మంత్రములో కకారము ఆదిమ వర్ణమగునేని కాదివిద్యయనియు హకారము మొదటియక్షరమగునపుడు హాదివిద్యయనియు పేరు. శక్తిస్వరూప విశేషములను తెలుసుకొనుటకు పై ఉపనిషత్తులకు సంబంధించిన భాష్యములను వ్యాఖ్యానములను పరిశీలించుట యవసరము. వేదమునకు సంబంధించిన షడంగములలో వ్యాకరణము ముఖముగా చెప్పబడుచున్నది. వ్యాకరణశాస్త్రమందు వాక్కుచైతన్య శక్తిరూపమున స్వీకరింపబడుచున్నది. వారావిధముగ స్వీకరించుటలో ఋగ్వేదశ్రుతిప్రమాణము. వాగ్దే



మాధవ

శ్రీ

వికి నాల్గుపాదములు కలవు. వానినన్నిటిని బుద్ధిమంతుడగు బ్రాహ్మణుడు తెలియగలడు. కాని మూడుపాదములు గుహాగుప్తములై యున్నవి. మిగిలిన నాల్గవపాదమును మాత్రము మానవప్రాణి తెలియును. ఈఅర్థముగల ఋఙ్మంత్రమునకు అనేక వివరణలు కలవు. మంత్రశాస్త్రానుసారముగా వాక్కు బ్రహ్మశక్తి పరాపశ్యంతి మధమా వైఖరిఅని దాని నాల్గుపాదములు. మొదటిమూడును బుద్ధిమనఃప్రాణముల గుహాలలో గుప్తములై యున్నవి. వైఖరీవాణి మాత్రమే మానవులకు ప్రత్యక్షమగును. అర్థముకన్న వేరుకానట్టిశక్తి సూక్ష్మమగు వాగ్దేవి. వ్యాకరణశాస్త్రములోని శబ్దబ్రహ్మ అపరబ్రహ్మ శక్తికి పర్యాయపదము. శక్తివిషయికమగు సౌభాగ్యకాండపై అనేకవిధములగు సూత్రగ్రంథములు వెలువడినవి. దశఖండీ కల్పసూత్రములో శాక్తాచార విచారములు విస్పష్టమొనర్పబడియున్నవి. మూలదత్త సంహితలోనున్న పదునెన్మిదివేల శ్లోకములను పరశురాముడు సూత్రించినాడని కొందరందురు. పరశురామ కల్పసూత్రము శాక్తపిధాన రహస్యమును స్పష్టము చేయు ఉత్తమగ్రంథము. శాక్తసిద్ధాంతము స్థాపితముచేయునట్టి అగస్త్యనిశక్తిసూత్రములు భరద్వాజశక్తిధర్మసూత్రములు నాగానంద శక్తిసూత్రములు ప్రత్యభిజ్ఞాన శక్తిసూత్రములు దైవమీమాంసా దర్శనము శ్రీ విద్యారత్న సూత్రములు శాక్తవాదమునకు సంబంధించిన సూత్రగ్రంథములుగా గ్రహింపతగియున్నవి. పైననిరూపించిన వైదికసూత్ర గ్రంథములకు భాస్కరాచార్యాదుల భాష్యములును శ్రీతత్వమును తెలియచేయునవియై ప్రసిద్ధిపొందియున్నవి.

శ్రీ

తంత్రగ్రంథములందు ప్రధానముగా శ్రీశక్తి విశేషము గోచరమగుచున్నది. పరమేశ్వరీస్వరూపము తంత్రగ్రంథములందు ప్రధానముగా తెలియతగియున్నదని బ్రహ్మయామళము చెప్పుచున్నది. శ్రౌతకాలానంతరము ఆగమగ్రంథములయొక్క ఆవిర్భావ మూహింపతగును. ఛాందోగ్యోపనిషత్తులో పంచామృత విద్యావర్ణన మున్నది. అచట సూర్య బింబము దేవమధువు అనుసంజ్ఞతో గోచరమగుచున్నది. ఆసూర్యబింబము నాల్గుదిశలకును తన కిరణములద్వారా బ్రహ్మాండమున మధురసమును ప్రసరింపచేయుచున్నది. విద్యామధువునకు నాల్గువేదములును, ఆధారపుష్పములు. ఆఉపనిషత్తునందు సూర్యు డూర్ధ్వముఖముగా నున్నట్లు చెప్పుచున్నారు. ఆ ముఖమునుండి ఊర్ధ్వస్రోతముద్వారాగా బ్రహ్మవిద్య ప్రసరించు చున్నది. అది కేవలము వేదములందు పరిసమాప్తమగుట లేదు. అందువలన దేశకాలనిమిత్తముల యొక్క పరివర్తనమున యుగానుసారముగా సిద్ధజనులద్వారమున బ్రహ్మవిద్య ప్రకటమగును. అందువలననే మాండూక్యోపనిషత్తునందు ఆగమప్రకరణము చెప్పబడినది. భోగమోక్షముల స్వరూపమును తెలియచేయునది ఆగమ మనబడుచున్నది. వైదికనిరూపణమందంతయు పూర్వభాగమున కర్మకాండద్వారా భోగసాధన స్వరూపమును ఉత్తరభాగమున జ్ఞానకాండ ద్వారా కేవల మోక్షస్వరూపము చెప్పబడుచున్నది. కాని ఐదవదియగు ఆగమము భోగమోక్షములకు ఏకార్థతను సంపాదించి వ్యవహార సుఖములను పరమార్థసుఖ



మాధవ

మును సంపాదించును. సామాన్యముగా ఆగమగ్రంథములు ఆ యా దేవతలయొక్క ప్రధానవాదములను నిరూపించు చున్నవి. శైవ వైష్ణవ గాణపత జైన బౌద్ధములు తమ తమ ఆగమ గ్రంథములతో నిరూపణముపొంది యున్నవి. అయినప్పటికి వాని యన్నిటియందును శ్రీ శక్తివాదము రూపాంతరమున ప్రవేశముపొంది కన్పడుచున్నది. శ్రీతత్వ మెచట ప్రధానముగా నిరూపింపబడినదో వానికి తంత్ర మని పేరు. తంత్రగ్రంథములందు ఈక్రింది విశేషములు కూడ విస్పష్టము చేయబడును.

ఆ యా దేవతకు సంబంధించిన స్వరూపము గుణము కర్మము మొదలగువానియొక్క పరిచింతనముండును. ఆ యా దేవతల మంత్రోద్ధారమును స్పష్టము చేయబడును. ఆ మంత్రా నుసారముగా యంత్రము దేవతాధ్యానము దేవతోపాసనకు సంబంధించిన పటలము పద్ధతి కవచము నామసహస్రము స్తోత్రము నియతరూపముతో నుండును. ఇట్టి తంత్రము లనే కము లున్నట్లు తెలియుచున్నది. కాని ఇప్పటికాలమున కొంతయే ఉపలబ్ధమగుచున్నది. తంత్రములలోని అభ్యాస ములు సంప్రదాయములు మంతవ్యములు. సృష్టి ఆరంభము నుండి గురు శిష్య పరంపరలోనని గుహ్యాదేశముగా నున్నవి. వీనికి ఆత్యంతికవినాశము కలుగదు. యుగధర్మానుసారమున తంత్రముల ఆదేశ మాది గురువులవలన సిద్ధగురువులవలన మానవులకు శ్రీ గురువులద్వారా ప్రకటనమగుచుండును. తన తల్లియొక్క జారత్వము తనకు తెలిసియున్నను పుత్రుడు

మాధవ

శ్రీ

గుప్తముగా నుంచునుగాని స్పష్టమొనరింపడు. అట్లే తాంత్రికులును తగిన అధికారి లేకపోయినచో తంత్రాదేశమును ఉపదేశింపరు. సత్సంప్రదాయమున ఉపదేశముపొందిన శిష్యుడు తన సాధనసిద్ధిక్రమమున సిద్ధపదమును పొందును. అంతమున పూర్ణాభిషిక్తుడగును. సత్యయుగమునందు దేవతలకై హైమవతీ ద్వారమున బ్రహ్మవిద్య ఉపదేశింపబడినది. త్రేతాయుగమునందు వశిష్ఠవిశ్వామిత్ర జనకపరశురామాది మహర్షుల ద్వారా బ్రహ్మవిద్యోపదేశము కల్గినది. ద్వాపరయుగమున శ్రీకృష్ణుడు ఆగమవిద్య నుపదేశించినాడు. ఇప్పటి ఈ కలియుగమందు శ్రీపూజ అనేక వ్రతములు ఒనరింపవలసినవిగా తెలియుచున్నది.

శక్తివిషయికమగు ఆగమశాస్త్రము మూడు వ్యూహములలో విభాగింపబడి కన్పడుచున్నది. సత్వరజస్తమోగుణములాధారముగా ఆగమములని తంత్రములని డామరములని చెప్పబడుచున్నవి. ఆయా విభాగమందనేక గ్రంథములు కలవు. చతుష్షష్టితంత్రములందు అనేక వ్యావహారికమైన విద్యలు పారమార్థికవిద్యలును కన్పడుచున్నవి. ఈ తంత్రముల విచారణలో వైదికము వైష్ణవము శైవము దక్షిణము వామము సిద్ధాంతము కౌలము అనెడు ఆచార భేదములు కన్పడుచున్నవి. వీనన్నిటిలోని తాత్వికసిద్ధాంతము శాక్తాద్వైతముగానున్నది. తాంత్రికవిశేషములు సామయికములని కౌలములని మిశ్రములనియు విభాగింప బడుచున్నవి. సామయికములు వశిష్ఠ సనక శుక సనందన సనత్కుమార సంహితలుగా



మాధవ

ఉన్నట్లు తలచుచున్నారు. ఈ ఐదింటిని ఆధారముగా చేసికొని భగవత్పాద శంకరాచార్యుడు శ్రీవిద్యాసముద్ధార మొనరించినట్లు తెలియుచున్నది. ఆవసిష్ఠాది సంహితలు నేడుప లబ్ధములగుట లేదు. వైదికాచారము మొదటిది. కౌలా చారము చివరిది. శక్తిపూజలో వైదికమే ముఖ్యమని తదితర ములు అముఖ్యములని కొందరి సిద్ధాంతము. కౌలాచారము పంచమకారములతో సంబంధించి యున్నది. నియమవిధి లేకనే చేయవలసిన ఆచారము లందున్నవి. అవి అధఃపాత హేతువులు. అవి నిందాపాత్రములు. ఇవియేకాక శక్తివాదము నకు సంబంధించిన నిబంధనలు వివరణము లనేకములున్నవి. పైన చెప్పబడిన గ్రంథములకు భాష్యములు వృత్తులు టీకలు వ్యాఖ్యానము లనేకములు కలవు. అనేక పురాణములందు శక్తివాద విశేషములు సులభములై యున్నవి. సిద్ధభావము పొందిన అనేక మహనీయులు మనోహరములగు స్తోత్రము లను ప్రకటించియున్నారు. వానియందును శ్రీ తత్వము తెలియతగి యున్నది. మార్కండేయ పురాణమున అగ్ని కూర్మాది పురాణములలో శక్తివాదము విపులముగా కన్పడు చున్నది. శ్రీ దేవీభాగవతము విస్పష్టముగా శక్తి విలాసమును గోచరము చేయుచున్నది. ఇవియేకాక ప్రాచీనగ్రంథముల నన్నిటిని పరిశీలించి రచింపబడిన గ్రంథము లనేకము లున్నవి. ఉత్తరామ్నాయ విషయికమగు కాశ్మీర శైవాద్వైత గ్రంథ ములలో శక్తివాదము స్పష్టముగా కన్పడుచున్నది. చిత్సంవిత్సిద్ధి తంత్రాలోకము పరాత్రింశిక ప్రత్యభిజ్ఞాసూత్రము మాలినీ

మాధవ

విజయము కామకళావిలాసము స్పందకారిక మొదలగునవి శక్తి తత్వబోధక గ్రంథములు. వీనియందు సామాన్యముగా ప్రత్యభిజ్ఞావాదము కూడుకొని యున్నది. ఆవాదము సంవి త్సిద్ధాంతమును అనగా శక్తి వాదమును ఆధారము చేసికొని ప్రసరించినదని చెప్పుట కవకాశమున్నది. అభినవ గుప్తాదులు ప్రత్యభిజ్ఞావాదమును చక్కగా ప్రతిపాదించినారు. శ్రీతత్వ చింతామణి గ్రంథమున కౌలమతముయొక్క శాస్త్రవిచారము స్పష్టముగా నున్నది. ఆగ్రంథములోని ఒక ప్రకరణము షట్చక్ర నిరూపణముగా ప్రకటింప బడినది. శాక్తసంప్రదాయ మును గురించి విశేషముగా బోధించు గ్రంథములు సంస్కృత వాఙ్మయమున అపారముగా నున్నవి. వాని సారాంశములు సంక్షేపరూపమున హిందీ బెంగాలీ మొదలగు భాషలలో అనువాద మొనర్పబడి యున్నవి.

అతి ప్రాచీనకాలము నుండియు భారతదేశమున శ్రీ శక్తి పూజావిశేషము ప్రసిద్ధమై యున్నది. అన్యవర్ణముల వారియందును శక్తిపూజ కన్పడుచున్నది. భారతదేశమున ప్రసిద్ధములగు అనేక స్థలములందు శక్తిపీఠములు స్థిరప్రతిష్ఠి తములై యున్నవి. ఆ యా నియత సమయములను విశేషాభి మానముతో పూజలొనర్ప బడుచున్నవి. మహానదులకును స్త్రీత్వమును బోధించునట్లు అనాదికాలమునుండియు నామ ములు ఉంచబడి సంప్రదాయక్రమమున వచ్చుచున్నవి. ధర్మాంధుల దుష్టభావమువలన అనేక విధానములు అనేక తంత్రములు అనేక సంప్రదాయములు మధ్యకాలమందును అవతరించినవి. అయినప్పటికి భారతదేశమందు శాక్తసంప్ర



మాధవ

శ్రీ

దాయము మాత్రము ఇంకను రమణీయమగు రూపముతో నిలచి యున్నది. తంత్రగ్రంథములందు శాక్తతంత్రములే ప్రసిద్ధములై యున్నవి. అన్ని దేవాలయములందును సవిశేషముగా నున్నవి. మహాశక్తియొక్క పరమోపాస్యత్వమును ప్రపంచమునకు భారతదేశమే చాటిచెప్పినది. నేటికిని ఈ ఒక్కదేశమునందే శక్తి విద్యారహస్యము సజీవమై యున్నది. నిఖిలప్రపంచమునకు ఉపాసనాభిక్షను ప్రసాదింపగలది భారతదేశమొక్కటియే అనుట సత్యవచనము.

భారతీయపురాతత్వములకు సంబంధించిన విషయముల వలె శక్తి ఉపాసనా విశేషముకూడ రహస్యముగా కప్పబడి యున్నది. శక్తిని దేవీరూపమున ఉపాసించుట హిందూ గ్రంథములందు తరువాతికాలమున ప్రారంభమైనదని కొందరు అనుకొనుట అప్రమాణికము. మోహానజోదారోహరప్ప మొదలగు స్థలములలో భూగర్భమున పరిశోధించి చూడగా అతిప్రాచీనకాలమునుండి భారతవర్షమున ప్రచారమందున్న మహాదేవీ ఉపాసనాపద్ధతి తెలియవచ్చును. భారతీయుల శక్తి వాదముతో సమానముగా ఈప్యామైనర్ మిశ్రీఫినేషి స్పష్టముగా నున్నది. బ్రహ్మతత్వ మెట్టి సూక్ష్మమో అట్లే శక్తితత్వముకూడ సూక్ష్మమై యున్నది. దుర్విజ్ఞేయమై యున్నది. ఈతత్వమును తెలియచేయుటకే అనేక విషయములు ప్రసరింపబడి యున్నవి.

మహాశక్తియొక్క స్వరూపమును తెలిసికొనుటకు మూడుపదార్థములను తెలియవలయును. శక్త శక్తి శక్యములు

ఈ మూడును తెలియతగియున్నవి. సమర్థము అగుదానికి శక్తము అని పేరు. సామర్థ్యమునకు శక్తియని పేరు. సమర్థుడు తన సామర్థ్యమును దేనియందుంచునో అది శక్య మగుచున్నది. అగ్నిదహనకర్మ శక్యము. శక్తము అగ్ని. అందలి దాహకత్వము శక్తి. తృణము మొదలగు నట్టివానియొక్క దహనకర్మ శక్యము. కాగా శక్తమనగాకారణమని శక్తియోగ్యతయని శక్యము కార్యమని తెలియవచ్చును. పృధివ్యాది పంచభూతములందును స్థావరజంగమాది సర్వపదార్థములందును శరీరేంద్రియము లందును ఎట్టెట్టి కార్యమంధైనను యోగ్యత ఆవశ్యకము. ఏవస్తువు నైనను శక్తిరహితమై యుండదు. అన్నము ఆకలిని పోగొట్టు శక్తికలదై యున్నది. జలము దప్పికనుదీర్చు శక్తి కలదై యున్నది. ఇట్లే పత్రపుష్పఫలాదులు ఓషధులు వనస్పతులు సర్వములు నని తెలియవలయును. చీమ మొదలు గజమువరకు స్తంబాదిపర్యంతము ఏదియేని శక్తితో కూడుకొని యున్నది. అగ్ని మండించు శక్తి కలదై యున్నది. తృణము నందు మండునట్టి శక్తియున్నది. ఈవిధముగా ఒక్కొక్క కార్యమందు కారణము భిన్నభిన్న శక్తులను కూర్చుచున్నది. ఘటమొక్కటియే కార్యము. దానియందు కులాలచక్రదండ సూత్ర సలిల శక్తులు ఒకే కార్యమం దుంచ బడుచున్నవి. అట్లే ఈ మహాప్రపంచమున ఏవస్తువును చూచినను శక్తి విరహితము కన్పడదు. సర్వవస్తువులం దుండునట్టి శక్తియేమి? ఏవస్తువునైనను శక్తిరహితమై ఏల ఉండుటలేదు? ఈ ప్రశ్నలకు సమాధానము చెప్పుటకు అన్నిటను వ్యాపకమైన



మాధవ

శక్తి ఒకటికలదని గ్రహింపవలయును. ఆమహాశక్తియే సర్వ పదార్థములందును కూడుకొనియున్నది. అదియే మూల ప్రకృతియని బ్రహ్మయని పరమాత్మయని మాయయని అనేక విధముల చెప్పబడుచున్నది. ఇట్లు చెప్పబడునదియే మహాశక్తి. శక్తియనునామము ప్రతిమానవునకును అనుభవమునందున్నది. శక్తి శక్తము రెండును పరస్పరము భిన్నములని కొందరందురు. అభిన్నమని కొందరివాదము. భిన్నాభిన్నములని వేరొకరివాదము. ఈవిషయమున ఆస్తిక దర్శనములందు ఏకమతము లేదు. శక్తియనునది పదార్థాంతరము కాదని తార్కికులు చెప్పుదురు. శక్తిస్వరూపము సాధారణముగా లౌకిక ప్రత్యక్షవిషయము కాదు. కొన్నికొన్ని విశిష్టకార్యముల ద్వారా ఆ స్వరూప మూహింపవలసియున్నది. ఈ మహావిపుల విశ్వమున కంతటికిని పరబ్రహ్మ కారణము. అతడు శక్తుడు. ఈ ప్రపంచనిర్మాణమునకు సమర్థమగు యోగ్యత పరమాత్మయందున్నది. అదియే శక్తి. అట్టిశక్తికన్న పరమాత్మ అతిరిక్తుడుకాడు. ఒకేపదార్థము దృష్టిభేదము ననుసరించి భిన్న భిన్నముగా కన్పడవచ్చును. పరమేశ్వరునకును పరమేశ్వరశక్తికిని ధర్మధర్మి భావమున్నది. పరమేశ్వరుడు ధర్మి. శక్తి ఆతని ధర్మము. ధర్మధర్ములకు భేదములేదు. అఖండమగు పరబ్రహ్మతత్వము ప్రపంచవిలాసమునకు ఉన్ముఖమై యున్నప్పుడు పరమేశ్వరశక్తిగా వ్యవహరింపబడును. మోక్షఫలము నిచ్చునదై నివృత్తికి ఉన్ముఖముగా నున్నప్పుడు పరబ్రహ్మగా చెప్పబడుచున్నది. పరమాత్మసచ్చిదా

నందమయుడు. పరమాత్మశక్తియు సచ్చిదానందస్వరూపిణి. పరమేశ్వరునుండి శక్త్యావిర్భావము పొందగా త్రిలోకములు చతర్దశభువనములు నుత్పన్నము లగుచున్నవి. ఆ శక్తి తిరో భావముపొందగా జగత్తు అభావరూపమగుచున్నది. వేద శాస్త్రాదులందు శక్తిపద ముపయోగింప బడినదని నిరూపింప బడినది. దేవి పరాశక్తి. ఈశ్వరి మూలప్రకృతి అనియు చెప్ప బడుచున్నది. విజ్ఞానానందఘనమైన బ్రహ్మతత్వము అత్యం తము సూక్ష్మము గుహ్యము అగుటవలన ఆరూపము నానాప్రకారముల చెప్పబడుచున్నది. శ్రద్ధాపూర్వక ముగా విజ్ఞానానందస్వరూపమైన మహాదేవిని ఉపాసింప వలయును. సమస్తజగద్రూపమై భాసించునది శక్తియే. అన్ని టియందును వ్యాపకమైయుండుటవలననే అది మహాశక్తియని పరాశక్తియని చెప్పబడుచున్నది. ప్రపంచకమంతయు త్రిగుణా త్మకమై యున్నది. అట్టియపుడు త్రిగుణాత్మకమైన తత్వమునే ఉపాసింపవలయును. పరాశక్తి త్రిగుణములతో కూడుకొని యున్నది. బ్రహ్మనిర్గుణము. అది ఉపాస్యముకాదు. అదిఅందరకు విజ్ఞేయము. శక్తి ఒక్కటియే ఉపాస్యము. శివకేశవాదుల నెవరెవరి నర్చించినను మహాశక్తినే ఆరాధించినట్లు అగును. గుణమయముగా నుండునట్టి ఏ యే దేవతారాధనమైనను శక్తి యొక్క ఆరాధనమే యగుచున్నది. మహాశక్తియందు శబ్ద విధానము ననుసరించి స్త్రీత్వము భాసించునప్పటికి అచట ఏనియమమును లేదు. పరాశక్తి స్త్రీ యనికాని పురుషుడనికాని ఉపాసింపబడును.

శ్రీ

ఉపాసనచేగాని మానవుడు తరింపడు. మానవుని ఉపాసనవలన శక్తియొకటి సిద్ధమగుచున్నది. శక్తి అనేకవిధముల నుండవచ్చును. ఈవిషయముస్పష్టమే. ఆ యా శక్తులను సంపాదించుటకు ఆ యా దేవతల నారాధించుట లోక ప్రసిద్ధమై యున్నది. ఏశక్తియేని మహాశక్తియే అగుచున్నదని నిరూపితార్థము. "పరాస్యశక్తిఃవివిధైవ శ్రూయతే" అను వచనానుసారమున పరమేశ్వర సంబంధమైన ఆత్మశక్తి అనంతరూపములతో అవభాసించుచున్నది. ఉపాసకుల సౌలభ్యమునకు ఆ మహాశక్తి యొకటియే అనేకనామములతో చెప్పబడుచున్నది. ఆత్మశక్తి మహావిద్య పరాశక్తి త్రిపురసుందరి లలిత భట్టారిక మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వతి మొదలగు నామములతో శక్తివిశేషమే నిరూపింప బడుచున్నది. శక్తి నుపాసించువారలకు శక్తత్వము సిద్ధించును. నామరూపరహితమైన తత్వమును సాధకుడుపాసింపజాలడు. ఉపాసనఅనునది అంతరంగ కార్యము. అంతరంగము గుణమయము కావున గుణాత్మకమైన తత్వమే ఉపాస్యమగుచున్నది. పరమాత్మ తత్వము నిర్గుణము నిర్ధర్మకమని గ్రంథములు చెప్పుచున్నవి. అట్టిది ఉపాస్యము కాజాలదు. గుణరహితమునుండి గుణసహితముత్పన్నమగుటలో అఘటన ఘటనా సమర్థమగు పరాశక్తియే హేతువు. ఆ పరమాత్మశక్తి వలన గుణమయమగు సృష్టికలుగగనే నామరూపము లావిర్భవించినవి. ఆత్మతత్వమునుండి వెలువడిన నామము మహామంత్రము. అది మొదటిసృష్టి. ఆత్మసృష్టి శక్తిరూపము పొందుచున్నది. కాబట్టి శ్రీశక్తి మంత్రము దేవతయని గ్రహింప

మాధవ

వచ్చును. నామమునకు రూపములేదు. రూపరహితమునుండి స్వరూపము వెలువడును. ఇందును ఆత్మశక్తియే హేతువు. శబ్దము సృష్టిప్రణాలికను కూడుకొని నానావిధమగు ధ్వన్యాత్మకత్వము పొందును. ఈధ్వని తత్వమంతయు పరమేశ్వరీ విలాసమే. సృష్టిప్రణాలికలో కూడుకొనిన శబ్దము రేఖారూపము పొందినది. ఆవిశ్వరూపములగు నాదమున బిందువు సముత్పన్నమై ఉచ్ఛూనత్వముపొంది నానావిధసృష్టికి హేతువగుచున్నది. శబ్దముయొక్క గమనిక తరంగరూపముగ్గా నుండునని ప్రామాణికులుచెప్పుచున్నారు. కదంబకోరకన్యాయమున సముద్రతరంగన్యాయమున ధ్వని ప్రవాహమును తాత్వికులూహించుచున్నారు. మొగ్గలవలె రేకులవలె కోణాకారములతో అనేకవిధమున ఉచ్ఛూనబిందువు మారుట సుప్రసిద్ధము. కావున శబ్దమునకు సృష్టిలోని ప్రణాలికలో బిందువు వృత్తము దళములు కోణములు ఏర్పడును. ఇవన్నియు రేఖల సముదాయములో సిద్ధము లగుచున్నవి. ఇట్లుద్భవముపొందిన శ్రీతత్వము యంత్రరూపమును పొందుచున్నది. కావున పరమేశ్వరీశక్తి సర్వ మంత్రాత్మికము సర్వ యంత్రాత్మికము అగుచున్నది. నానావిధరేఖల యొక్క తగిన ఆకారవిన్యాసము సుస్పష్టమగు రూపములు పొందును. ఆరూపమునందు దేవత అనుగతమైయున్నది. ఆరూపము ఏకరూపముననే ఉండునని అనుకొన నక్కరలేదు. అనంతరూపములచటనావిర్భవించును. ఆమహాదేవి అనంతరూపాత్మికమై శోభించుచున్నది. సర్వవిద్యాత్మిక సర్వ తంత్రాత్మిక అయిన పరాదేవియొక్క విచిత్ర

విలాసము అత్యంతము హృదయంగమము. శ్రీ శక్తి శ్రీ విద్య అత్యంతము గంభీరము. అద్దాని యోగ్యత నిరూపించుట శక్యముకాదు. శ్రీ విద్యాంతర్గతములైన అనేకవిషయము లున్నవి. వాని నిరూపణములేక శ్రీ విద్యనే నిరూపించుట అశక్యప్రాయము.

శ్రీవిద్యయే లలిత రాజరాజేశ్వరి మహాత్రిపురసుందరి బాల పంచదశి షోడశి మొదలగు నామములతో విఖ్యాతమై యున్నది. వీనియన్నిటికిని మూలతత్వ మొకటియే. ఈ చెప్పబడినవన్నియు అవస్థాభేదమునకు పరిచాయకములు. అనంత సంఖ్యాకములగు మంత్రములు కలవు. వానియందు కొన్నిటికి మహావిద్యలని పేరు. మహావిద్యలు పదియని ప్రసిద్ధి. దశ మహావిద్యలలో షోడశీవిద్యయే శ్రీ విద్యగా చెప్పబడుచున్నది. సాధారణముగా ఉపాసకులందరును తమ ఉపాస్య దేవతయే సర్వప్రధానమని సర్వ శ్రేష్ఠురాలని పరబ్రహ్మాత్మిక యని అభిమానింతురు. ఈ భావనతో చూచినచో కాళి తార షోడశి మొదలగునవన్నియు సమానవిద్యలే. కావున విశేష నిరూపణమునకు ఆవశ్యకత లేదు. తమ తమ ఉపాస్యదేవతను సర్వప్రధానముగా తలచుట ఆయా దేవతాభక్తులకు సముచితమే. తదనుసారముగా కాళీభక్తునకు మహావిద్యలలో కాళీవిద్య సర్వశ్రేష్ఠముగా భాసించుట అనుచితము కాదు. కాని శ్రీ విద్యా ప్రాధాన్యవిషయమున విషయవివేకము వేరుగా నున్నది. శ్రీ విద్యయొక్క మహత్వము వాస్తవికము. అది కేవల భక్తికల్పితము కాదు. దశమహావిద్యలలో కాళీ

విద్య తారావిద్య షోడశీవిద్య సర్వప్రధానములు. ఈమూడిటి నుండి తొమ్మిదివిద్య లుత్పన్నములైనవి. ఈతొమ్మిదియు వీనికి పూరకమైన విద్యయుకలసి దశమహావిద్య లగుచున్నవి. మూల భూతమగునది ఏకవిద్యయే. సర్వమూలభూతమైన విద్యయే శ్రీ విద్య యనబడుచున్నది. ఇదియే బ్రహ్మవిద్య. ఇదే బ్రహ్మమయీ విద్య. కాళీతారాదివిద్యలును షోడశీవిద్యయగు శ్రీవిద్యతో సంబంధించియున్నవి. కావున మొత్తముమీద దశమహావిద్య లందు శ్రీవిద్య సర్వప్రధానమని అంగీకరింపవచ్చును.

శ్రీవిద్యాశబ్దమున శ్రీత్రిపురసుందరీ మహామంత్రము. ఆ మంత్రమునకధిష్ఠాత్రియగు దేవత ఈరెండును తెలియ బడుచున్నవి. సామాన్యముగా శ్రీశబ్దమునకు లక్ష్మి అని అర్థము. శ్రీవిద్యాప్రభావమును వర్ణించునట్టి గ్రంథము ననుస రించిచూడగా మహాత్రిపురసుందరియే శ్రీశబ్దమునకు ముఖ్యార్థమని తెలియుచున్నది. శ్రీలక్ష్మి మహాత్రిపురసుంద రిని చిరకాల మారాధించినది. అనేక వరదానముల పొందినది. తాను కేవలము శ్రీశబ్దముచే ఖ్యాతిని పొందవలయుననియు లక్ష్మి కోరుకొనినది. అప్పటినుండి శ్రీశబ్దమునకు మహా లక్ష్మి సిద్ధమైన అర్థముగా గ్రహింపబడుచున్నది. కాగా మహాలక్ష్మి అను అర్థము శ్రీపదమునకు గౌణము. శ్రీ అనగా మహాత్రిపురసుందరి దేవత. ఆమెను ప్రతిపాదించు విద్య ఆయమ మంత్రము శ్రీవిద్య అనబడుచున్నది. వాచ్య వాచకములకు భేదములేదు. కావున ఆమంత్రమున కధిష్ఠాత్రి యైన దేవతయు శ్రీవిద్యగా చెప్పబడుచున్నది. సామాన్య

ముగా శ్రీశబ్దము శ్రేష్ఠత్వమును బోధించును. శ్రేష్ఠులను చెప్పు నపుడు మొదట శ్రీశబ్దమును ప్రయోగించుట ప్రసిద్ధమై యున్నది. శ్రేష్ఠత్వములోని తారతమ్యానుసారముగా మూడు నాల్గైదారు పర్యాయములు వరకు శ్రీశబ్దమును ప్రయోగింప వచ్చునని శాస్త్రములు ప్రమాణములుగా నున్నవి. ఇప్పటి కిని ఆయా సంప్రదాయ ప్రవర్తకాచార్యులకు ౧౦౦౮ వరకు శ్రీప్రయోగ మొనరించుచున్నారు. కావున శ్రీశబ్దము శ్రేష్ఠతను పూజ్యతను సూచించునది యని గ్రహింపవచ్చును. పరబ్రహ్మ సర్వశ్రేష్ఠుడు. బ్రహ్మకలాంశమగుటను శ్రీశబ్దము సూచించును. ఎవరెవరియందు అంశముగానైనను బ్రహ్మ కళ అవభాసించునో వారు శ్రీశబ్దపూర్వకముగా వారి వారి నామములచే వ్యవహరింపబడుచున్నారు. శ్రీవిష్ణు శ్రీశివ శ్రీదుర్గ శ్రీకృష్ణ శ్రీగురు మొదలగు పదములలో బ్రహ్మాం శము గోచరమగు చున్నది. సర్వకారణభూతమైన ఆత్మ శ్రీ శక్తి త్రిపురేశ్వరి సాక్షాత్ పరబ్రహ్మస్వరూపిణి అగుట వలన కేవల శ్రీశబ్దముచే కూడ చెప్పబడుచున్నది. సాః శ్రీః అమృతా సతాం మొదలగు శృతియు పరబ్రహ్మస్వరూపిణి యగు శ్రీవిద్యను స్తుతిచేయుచున్నది. విభిన్న దేవతలను ఆరాధించినచో పశుపుత్ర ధనధాన్యస్వర్గాది ఫలములు సంప్రాప్తములగును. ఇట్లు ఆ యా దేవతల విశేషములను చెప్పునట్టి శాస్త్రములు బోధించుచున్నవి. శ్రీవిద్యోపాస కులకు లౌకిక ఫలమును సంప్రాప్తమగును. దానితో పాటు ఆత్మజ్ఞాన ఫలమును కల్గును. అధర్వణ వేదపు ఉపనిషత్తులలో

మాధవ

"పాంశాకుశ ధనుర్బాణాసనాం వేద సశోకంతరతి" అను వచనములో శ్రీవిద్యోపాసకునకు శోకోత్తీర్ణతారూప మగు ఫలమును లభించునని చెప్పబడియున్నది. ఆత్మ జ్ఞానికి సంప్రాప్తమగునట్టి శోకోత్తీర్ణత శ్రీ ఉపాసకునకు కూడ నిశ్చయముగా లభించునని పరమార్థము. కావున ఫలైక్యమునుబట్టి శ్రీ విద్యయే బ్రహ్మవిద్యయని నిర్వివాద ముగా సిద్ధాంతము చేయవచ్చును.

కొందరిట్లనుకొనవచ్చును. శోకమోహముల తరించుట అనునట్టిదే అభీష్టఫలమైనప్పుడు "ఆత్మావాఅరేశ్రోతవ్యః" అనువచనానుసారముగా శ్రవణమననాదుల నాచరించి నివృత్తిమార్గమున ప్రసరించుటయే ఉచితము. శ్రీ విద్యో పాసనాత్మకమైన కర్మకాండయందు ఏల ప్రవర్తింపవలయును? అని. ఇందీసమాధానమును గ్రహింపవలసియున్నది. ఆత్మజ్ఞాన ప్రాప్తికి శ్రవణమననాదులు చెప్పబడుట సత్యమే. అయినప్ప టికి అవి అత్యంతము కష్టసాధ్యములైయున్నవి. అవి ప్రఖర వైరాగ్యమార్గములు. కోటిమందిలో ఏయొక్కడోగాని తదధికారి కాజాలడు. తన పూర్వపుణ్యవశమున తన సౌభాగ్య వశమున సద్గురుసన్నిధానమందు యోగ్యసంప్రదాయములో శ్రీ విద్యోపాసన లభించినట్లైన సామాన్యమానవుడుకూడా తన ఉపాసనా పరిపాకమున శ్రీమాత శ్రీమహారాజ్ఞికన్న భిన్నముకానట్టి గురుకృపవలన ఈజన్మయందే ఆత్మజ్ఞాని కావ చ్చును. శ్రవణమననమార్గమునందు ఒకప్పుడైన పతనశంక యున్నది. శ్రీవిద్యోపాసనామార్గమున శ్రీగురురూపమైన



మాధవ

శ్రీ శక్తి అనుగ్రహము అవలంబనముగా నున్నది. కాబట్టి పతనముకల్గుననను ఆశంక యవసరముకాదు. శోకమును తరించుట అనుఫలము అవశ్యంభావి. "సశోకంతరతి సశోకంతరతి" అను శృతివలన ఈవిషయము సూచింపబడుచున్నది. భోగముకల స్థలమున మోక్షములేదు. మోక్షముకలచోట భోగములేదు. శ్రీదేవీ సేవనతత్పరులకు భోగమోక్షములు కరస్థములే. శ్రీవిద్యయే ఆత్మశక్తి. ఆత్మశక్త్యుపాసనయే శ్రీవిద్యోపాసన. హారితాయన సంహితలో సంసార భయపీడితులకు శుభమార్గమేమికలదు? అను ప్రశ్నకలుగగా గురూపదిష్టమార్గమున ఆత్మశక్తియగు మహేశ్వరి త్రిపురాదేవిని ఆరాధించి ఆదేవీ కృపావేశమునుపొంది స్వాత్మభావమును పొందుటయే కర్తవ్యము. ఈ దృశ్యమానమగు నదంతయు ఆత్మ శ్రీవిలాసము అనునది సమాధానముగా చెప్పబడినది. స్వాత్మశక్తియగు శ్రీవిద్యయే లలితకామేశ్వరీ మహాత్రిపురసుందరీదేవత. మహాకామేశ్వరాంక నిలయమై ఆమె విరాజిల్లుచుండును. ఉపాధిరహితుడైన శుద్ధస్వాత్మ మహాకామేశ్వరుడనబడును. సదానంద రూపమగు ఉపాధి పూర్ణమగు అంతర్యామియైన సదానందమే ఉపాసకుని ఆత్మ. అదియే లలితాస్వరూపము. ధర్మత్రయ నిర్ముక్తమగు శ్రీ విద్యకు మహాకామేశ్వరు డాధారభూతుడు. పరదేవత తనకన్న భిన్నము కాదు. అంతఃకరణోపాధికమైన ఆత్మ ఉపాసకుడగుచున్నాడు. సదానందము ఉపాధిగా కల్గిన తన ఆత్మ ఉపాస్యమగుచున్నది. నిరుపాధికమైన ఆత్మ మహాకామేశ్వ

రుడు. శ్రీ కామేశ్వర కామేశ్వరీ రూపము శుక్లరక్తవర్ణ ముగా ధ్యానింపబడును. కామేశ్వర కామేశ్వరీ ద్వంద్వము శుక్లరక్తవర్ణముగా ఉపాసించుటలోని రహస్యము గురుముఖైక వేద్యము. కామేశ్వర కామేశ్వరీ స్వరూపము శివశక్తి సమర సాకారము. శక్తి విలాసమంతయు విమర్శభావము. శివవిలా సము ప్రకాశభావము. "మహాకామకామేశ్వరాంకనిలయే!" అని పరమేశ్వరిని సంబోధించు నపుడు కామేశ్వరీ కామేశ్వరుల యొక్క విగ్రహాత్మకమైన స్థూలరూపసంబంధము భాసించు చున్నది. కామేశ్వరుని అంకమందు కామేశ్వరి విరాజిల్లుటలో ఆసంబంధము పర్యవసిత మగుచున్నది. మహాకామకామేశ్వ రుడు కామేశ్వరీ రక్తికలవాడై యున్నప్పుడు మహాదేవీరంజితుడై భాసించును. అప్పుడు లాక్షాద్రవమునకు తత్సంబంధముకల వస్త్రమునకు ఏమియు భేదములేనట్లుగా ఈవిధముగా భావిం చుటయే రక్తవర్ణాత్మకమగు భావన అని సాంప్రదాయకులు చెప్పుచున్నారు. శివునిలోని శివత్వము మహాశక్తియొక్క సముల్లాస మున్నప్పుడే స్ఫురితమగును. శక్తి లేకపోయినచో శివుడు శవమగును. శక్తితో కూడుకొని యున్నప్పుడే శివునకు శక్తత్వము కల్గుచున్నది. కాకపోయినచో అతడు స్పందించు టకును కుశలుడు కాడు.

శ్రీ విద్యా రాజరాజేశ్వరీదేవత పంచప్రేతాసనముపై విరాజిల్లు చున్నది. బ్రహ్మ విష్ణువు రుద్రుడు ఈశ్వరుడు సదా శివుడు వీరు పంచమహా ప్రేతములు. పరమేశ్వరీదేవి ఈ పంచ ప్రేతములను సింహాసనముగా చేసికొన్నది. నిర్విశేషమగు బ్రహ్మ

తన శక్తివిలాసముద్వారా బ్రహ్మ విష్ణువు మొదలుగాగల ఐదు పేరులను పొందుచున్నారు. వామాదిశక్తుల సాన్నిధ్యమున సృష్టిస్థితిలయ నిగ్రహానుగ్రహ రూపమగు పంచకృత్యములను సంపాదించు చుండును. బ్రహ్మాదులు తమతమ వామాదిశక్తులతో రహితులై అసమర్థులైనప్పుడు వారు ప్రేతములని చెప్పబడుచున్నారు. వారియందును బ్రహ్మ విష్ణువు రుద్రుడు ఈశ్వరుడును ఈనల్గురును పాదములు. వీరిపై సదాశివుడు ఫలకముగా నుండును. మహాకామేశ్వరాంకమందు మహాకామేశ్వరి ప్రకాశించుచుండును. కామేశ్వరీదేవతకు నాల్గుభుజములు. ఆ నాల్గుభుజములందును పాశము అంకుశము ఇక్షుధనువు పంచపుష్పబాణము లుండును. ఇట్లామె రూపమును ధ్యానింపవలయును. ఇట్లామె ధ్యేయరూపమును వర్ణింపబడినప్పటికి వాస్తవస్వరూపము ఈవిధముగా తెలియవలయును. 36 తత్వములందు రాగము అనగా ప్రీతి అను తత్వమే పాశము. ఆరాగమును శ్రీ మాత పాశరూపమున ధరించినది. క్రోధమే అంకుశము. సంకల్పవికల్పాత్మకమగు క్రియారూపమైన మనస్సు ఇక్షుధనువు. శబ్దస్పర్శరూపరసగంధములు పుష్పబాణములు. పాశము ఇచ్ఛాశక్తియని, అంకుశము జ్ఞానశక్తియని, బాణధనుస్సులు క్రియాశక్తి స్వరూపములని వర్ణింపబడుచున్నవి. పూర్వముచెప్పిన విధమున మహాకామేశ్వరుని అంకమునందు పాశాంకుశాదులను ధరించిన పంచప్రేతాసనాసీనయైన మహాత్రిపురసుందరిని పూజించుట బహిర్యాగమనబడుచున్నది. అదియు అనేకపద్ధతులలో అనేక ప్రకార

ములతో విహితమైయున్నది. అంతర్యాగమే రహస్యపూజ యనబడుచున్నది. రహస్యపూజావిశేషము గురుసన్నిధాన మున సంప్రదాయ విశేషముగా తెలియతగియున్నది. అట్లా సంప్రదాయ విశేషముగా తెలుసుకొనిన ఆ అంతర్యాగమున ప్రతిదినమునను ఏకాంతమున నుండి చిచ్ఛక్తిని ఆరాధించు సాధకుడు సాక్షాత్ శివుడగును. భక్తుని ఉపాసనాసౌకర్యము కొరకు ఆత్మశక్తి యగు శ్రీవిద్య స్థూలమని సూక్ష్మమని పర మని మూడువిధముల ప్రకటమగుచున్నది. పరదేవియొక్క స్థూలమగు రూపము మంత్రసిద్ధిపొందిన ఉత్తమసాధకులకు ప్రత్యక్షమగును. అట్టి ఆరూపము కరచరణాద్యవయవము లతో కూడుకొన్నదై నిరతిశయ సౌందర్యము కలదై గోచర మగును. లోకోత్తరాహ్లాదకమగు తేజోరాశిగా ఉన్న ఆ రూపమును సాధకుడు తన నేత్రములతో చూడగలడు. తన హస్తములతో చరణముల స్పృశింపగలడు. పుణ్యవంతులైన సాధకులకు మంత్రాత్మకమగు రెండవరూపము గోచరించును. అట్టి మహనీయులకు కర్ణేంద్రియమున వాగింద్రియమున మంత్ర ప్రత్యక్షము కల్గును. మంత్రమయి అగు దేవత మంత్ర వర్ణములలో అవభాసించును. దేవతయొక్క శరీరావయవ ములను మంత్రవర్ణములతో భావించి మంత్రాత్మక స్వరూపము కల్గియున్నట్లు గోచరము చేసికొని సాధకుడు ధన్యుడగును. మంత్రధ్వని శ్రవణమున కర్ణేంద్రియమును మంత్రోచ్చారణ మున వాగింద్రియమును ధన్యమగును. సర్వమంత్రములకును మూలభూతమైన మాతృకా సరస్వతీరూపము మంత్రాత్మిక

రూపమని చెప్పబడుచున్నది. మూడవది వాసనాత్మకమగు రూపము.. మహాపుణ్యాత్ములైన సాధకులు మనోరూప మగు ఇంద్రియముతో ఆరూపమును గ్రహింతురు. ఆత్మశక్తి యగు జగన్మాతకు చైతన్యము స్వరూపము. ఆత్మచైతన్యము మనస్సుచే అనుభవింపబడును. ఉత్తమమధ్యమాధమరూపు లగు అధికారుల తారతమ్యములనుబట్టి ఉత్తమ మధ్యమాధమ రూపములైన ఈరూపములు ఉపాసనలో చెప్పబడుచున్నవి. వీనికిని అతిరిక్తముగా పరమేశ్వరీ రూపము కలదు. అది వాఙ్మనస్సుల కతీతము. కేవలము ముక్తులగువారే అఖండ మగు అహంతా రూపమున దాని ననుభవింతురు.

ఆత్మశక్తిరూపిణి అగు దేవత శ్రీవిద్య. ఆమంత్రమును ఉపదేశించిన సిద్ధగురువు శ్రీవిద్యామంత్రము ఈ మూడిటి యందును అభేదబుద్ధిని భావించుట ముఖ్యమగు ఉపాసనా పద్ధతి. అభేదభావన సంపూర్ణమైనప్పుడు పరమసిద్ధి లభించును. అది శ్రీనాథాదుల గురుసంప్రదాయ క్రమభావము శ్రీవిద్యా గురువులందు సంక్రమించిఉండును. అట్టివారియందు శ్రీవిద్యాఽ భేదము సిద్ధప్రాయమై యున్నది. అట్టిగురువుతోటి అభేద మును భావించినప్పుడు శిష్యుడుకూడ శ్రీవిద్యతోటి అభేద మును పొందగలడు. శ్రీవిద్యతోటి అత్యంతమభేదము సిద్ధించుటకొరకు గురుకృప అత్యంత మావశ్యకము కావున గురువుతోటి అభేదమును భావించుట నితాంత మావశ్యకమై యున్నది. ఘటకలశకుంభపదములు సమానార్థకములు. అట్లే గురుమంత్ర దేవతాపదములన్నియు ఏకార్థవాచకములని

చెప్పబడుచున్నది. శ్రీవిద్యలో పండ్రెండు సంప్రదాయము లున్నవి. శ్రీవిద్యోపాసకులు పండ్రెండుగురు ప్రసిద్ధులు. మనువు చంద్రుడు కుబేరుడు లోపాముద్ర మన్మథుడు అగ్ని సూర్యుడు ఇంద్రుడు స్కందుడు శివుడు, క్రోధ భట్టారకుడు. ఈతడే దుర్వాసముని. వీనియందు ప్రత్యేకముగా వేరువేరు సంప్రదాయములు కలవు. లోపాముద్రా మన్మథ సంప్రదాయములు ఇప్పుడు ప్రచలితములై యున్నవి. వానియందుకూడ మన్మథ సంప్రదాయము అనగా కామరాజవిద్య సర్వతోముఖమై యున్నది. కామదేవుడు నిర్వ్యాజమగు ఆరాధనచేసి శ్రీ మాతను ప్రసన్నను చేసికొనినాడు. ఇతర దుర్లభములగు వరములను ఆమె ఆతని కిచ్చినది. అందరి ఉపాసకులలో కామరాజవిద్యకు శోభనత్వమును కూడా ఆమె ప్రసాదించినది. అప్పటినుండియు కామరాజవిద్య విశేషప్రచారము పొందినది. కామరాజవిద్య కాదివిద్య అనబడుచున్నది. లోపాముద్ర విద్య హాదివిద్య యనబడును. రెండును పంచదశవర్ణాత్మకములే. తత్సంప్రదాయములందు కామేశ్వరాంక నిలయయగు కామేశ్వరీపూజామంత్రములలో కాదిహాది విద్యాయుక్తమైన మంత్రయోజన ప్రసిద్ధమై యున్నది. మిగిలిన మనుచంద్రాది పదివిద్యలు ఆమ్నాయపారమునందే యున్నవి. ప్రసిద్ధమైన ఉపాసనాపద్ధతిలో వానికి విశేషోపయోగము లేదు.

శ్రీకామరాజవిద్యయే శ్రీవిద్య. ఈవిద్యకే త్రిపురావిద్య యనిపేరు. త్రిమూర్తులకన్నను పురాతన మగుటచే త్రిపుర యనబడుచున్నది. గుణత్రయాతీతమై త్రిగుణములను నియ

మించునదియై ఉండునట్టి శ్రీశక్తి త్రిపురఅనబడును. త్రిపురాశబ్ద మునకు అనేక విధములగు అర్థములు ప్రసిద్ధములై యున్నవి. ఇడా పింగళా సుషుమ్నానాడులు త్రిపుర అనబడును. మహ బుద్ధి చిత్తములను పురములలో నివాసముచేయు దేవి త్రిపుర యనబడును. త్రిమూర్తులకు జనని అగుటచే త్రిపుర యని చెప్పబడును. వేదత్రయమయీదేవత అగుటవలనను శ్రీ త్రిపురయనబడును. మహాప్రళయమందు త్రిలోకము లను తనయందు లీనము చేసికొనినది అగుటచే త్రిపురయనియు వ్యవహరింపబడును. త్రిపురాదేవి శక్తిత్రయాత్మిక. ఆమెకు ఇచ్ఛాశక్తి శిరోభాగము, జ్ఞానశక్తి మధ్యభాగము, క్రియా శక్తి అధోభాగము ఇట్లు సంకేతపద్ధతిలో ఆస్వరూపము గ్రహింపఁబడుచున్నది. త్రికూట నివాసిని యగుటయు త్రిపు రాదేవి యనబడును. అవస్థాత్రయము త్రిపురయనబడు చున్నది. అవస్థాత్రయమందు భాసించునట్టి ఆ మహాదేవి త్రిపురాశబ్దవాచ్య. మాతృమేయమానములు కూడియుండు టనుకూడ శ్రీశక్తి త్రిపురయనబడును. త్రిపురాదేవియే ఆత్మశక్తి అగ్నిజ్వాలప్రజ్వలించి అంగారసమష్టియందే ఆవిర్భ వించి శాంతమగునట్లు సమస్థ మాతృమండలశక్తి సంఘట్ట రూపిణి మహాచైతన్యాత్మికయగు శ్రీస్వరూపము ఎచటనుండి ఆవిర్భూతమగునో ఎచటెచట అంతర్భూతమగునో ఏతర్కమున గాని ఏయుక్తివలనగాని కన్పడదు. ఆత్మశ్రీస్వరూపమగు శ్రీ విద్య తనలీలచే ఎప్పుడు శరీరమును ధరించునో అప్పుడే వేద శాస్త్రములు ఆ నిరూపణము చేయును. ఆ మహాశక్తి చిచ్ఛక్తి

పేరుతో చెప్పబడినది. ఆదేవి లీలావిగ్రహముయొక్క మాహా త్మ్యము అనంతము. ఇతరదేవతాధ్యానముకన్న శ్రీవిద్యాధ్యాన మందు విశేషమున్నది. సర్వదేవతల ధ్యానమునందు వరా భయముద్రలుండును. ఆయాదేవతలు తమతమ భక్తులకు వరాఽభయము లిచ్చుటలో భావము స్పష్టముచేయుదురు. తన అభీష్టములను సంపాదించి తన భయములను పోగొట్టునట్టి దేవతనే సాధారణముగా భక్తుడు ఆరాధించును. శ్రీ విద్య యన్ననో బ్రహ్మమయీదేవత. సర్వజగత్కల్యాణమునకు ఆదేవి ఆవిర్భవించినది. అట్టి మహాదేవికి వరాభయప్రదాన రూపమగు నాటకమును ప్రదర్శించుటలో ఆవశ్యకత ఏమి యున్నది? శంకరభగవత్పాదుని స్తోత్రమున ఈఅర్థముకలదు. "మాతా! నీకన్న ఇతరులు తమహస్తములందు వరాభయదాన ముద్రలను ధరింతురు. తల్లీ నీవొక్కతెవే వరాభయదాన ముద్రాభినయము చేయవు. కాని నీభక్తులకు వరాభయములు లభించు చున్నవి. మాతా! భక్తసముదాయమునకు భయము నుండి రక్షించుటవాంఛాసమధికమైన ఫలమునిచ్చుటకు సర్వ లోకశరణ్యురాలవైన నీచరణములే శరణములై యున్నవి". ఇతర దేవతలు తమ చేతులతోనిచ్చు ఫలములను బ్రహ్మ మయీదేవతయగు మహాదేవి తన శ్రీచరణములచే ప్రసాదించు చున్నది. శ్రీ విద్యకు సంబంధించిన లీలావిగ్రహములు అనం తములు గా నున్నవి. ఇంద్రాదిదేవతలయొక్క గర్వపరిహారము నకై శ్రీమాత కుమారీ రూపమున ప్రకటితమైనది. సర్వకా రణమైన పరబ్రహ్మ విష్ణువు శివుడు. వీరలయొక్క సృష్టిస్థితి

శ్రీ

సంహారాత్మకమైన కార్యమునందు సహాయముచేయుటకై పరమేశ్వరి సరస్వతి లక్ష్మి పార్వతిరూపమున ఆవిర్భవించి త్రిమూర్తులను వివాహమాడినది. అందుచే పరమేశ్వరి త్రిరూప అనబడును. ఒకప్పుడు మర్త్యలోకమునందు మానవులు యజ్ఞ యాగాదులొనరింపలేదు. ఇంద్రాదిదేవతలు చింతనమొనర్పసాగిరి. బ్రహ్మ ఆదేశానుసారముగా దేవతలు శ్రీమహాలక్ష్మిని ఆరాధించిరి. శ్రీమహాలక్ష్మి తనపుత్రుడగు కామదేవుని దేవకార్యమున సహాయమునకై పంపినది. కామదేవునకు భూలోకపతి వీరవ్రతునకు ఘోరయుద్ధము జరిగినది. కామదేవు డందరిని జయించినాడు. వీరవ్రతుడు ఈఆపదను పోగొట్టుకొనుటకు శంకరు నారాధించెను. శంకరానుగ్రహమున త్రిశూలాత్మకమగు బాణము వీరవ్రతునకు లభించినది. అప్పటియుద్ధములో ఆబాణమున కామదేవుడు హతుడైనాడు. లక్ష్మి త్రిపురాదేవి అనుగ్రహమున అమృతద్వారమున ఆతని బ్రతికించినది. శంకర ప్రభావమున తనకు పరాజయము కల్గినదని కామదేవుడు శంకరునిపై ద్వేషము వహించెను. దేవిని ఆరాధించి శంకరుని హరించుటకు కామదేవుడు ప్రతిజ్ఞపట్టినాడు. త్రిపురాదేవిచే పంపబడిన శ్రీగౌరీదేవి అచట సాక్షాత్కరించినది. శంకరుని గొప్పతనమును చెప్పి అతనితోటి స్పర్థ ఉచితముకాదని గౌరీదేవి చెప్పినది. కాముడు తనపట్టుదలను విడువలేదు. గౌరి కోపించి నీవు శంకరునివలన దగ్ధమగుదువు అని శపించెను. మహాలక్ష్మి అడివిని పతినిందవలన నీవును దగ్ధమగుదువు అని గౌరిని శపించెను. పిమ్మట లక్ష్మి గౌరి ఇద్దరును యుద్ధమొన

శ్రీ

గ్చిరి. ఒకరొకరి ప్రహారములవలన మూర్ఛితులైరి. సరస్వతి మధ్యస్థత వహించినది. యుద్ధము శాంతమయ్యెను. శివుని జయించుటకు కాముడు మహాలక్ష్మివలన సౌభాగ్యాష్టోత్తర శతనామస్తోత్రము నుపదేశము పొందెను. ఆతడు మందర గుహాలో ఆరాధించినాడు. దేవి ప్రసన్నమై స్వప్నమున కామదేవునకు దాచబడిన పంచదశీవిద్య నుపదేశించినది. మూడు దివ్యవర్షములు ఏకాగ్రతతో కామదేవుడు శ్రీదేవిని ఆరాధించినాడు. భగవతి ప్రసన్నమై సాక్షాత్కరించినది. తన ధనుశ్శరములనుండి ధనుశ్శరములను ఉత్పన్నముచేసి కామదేవుని కిచ్చినది. కామా! నీవిప్పటినుండియు అజేయుడ వయ్యెదవు అని ఆమె అనుగ్రహించినది.

దక్షయజ్ఞమున పతినిందనువిని గౌరి భస్మమైనది. పిమ్మట హిమవంతునకు కూతురైనది. శివతపోభంగమును చేయుటకు మన్మధుడురాగా గౌరీసన్నిధానమున శివుని నేత్రాగ్ని మన్మధుని దహించినది. ఇట్లనేకవిధముల లీలా విగ్రహములు పరమేశ్వరికిని రూపింపబడినవి. వానిలో కొన్ని విశేషములు మున్ముందు చెప్పబడును.

నానావిధమైన భావనాపరంపర చిరప్రరూఢమైనప్పుడు గాని మననము చేయుసామర్థ్యము కల్గదు. చక్కగా మననశీలు డైన మానవుడు తత్వాంశమును గ్రహింపగలడు. ఆత్మ శ్రీ భావసంపదను అవగాహము చేసికొనుటకు ఈ క్రిందివిధ మునకూడ భావించుట సముచితము. లోకస్వభావమంతయు ద్వివిధముగ నున్నది. ప్రవృత్తి స్వభావము నివృత్తి

3

స్వభావము. ప్రవృత్తియు నివృత్తియు రెండును ప్రపంచ మును సూత్రానుబద్ధము చేసినవి. నివృత్తియే సర్వవిధ ముల సర్వజీవులకు ఆకాంక్షణీయము. దాని ననుస రించియే ప్రతి మానవుని ప్రవృత్తియు ప్రచలిత మగుచున్నది. ప్రవృత్తిమార్గమందు చక్కగా ప్రసరించినగాని చరితార్థత కల్గదు. ప్రవృత్తి సామాన్యముగా రెండు విధములుగా నుండును. ఒకటి దైవము. రెండవది ఆసురము. ఆసుర ప్రవృత్తి యందు కూడ ద్వివిధత్వమున్నది. ఆస్తికమైన ప్రవృత్తి ఒకటి. నాస్తికమైన ప్రవృత్తి వేరొకటి. సామాన్యముగా ప్రవృత్తి యంతయు కామనాపూర్వకముగా నుండును. ఇష్ట సాధనతా జ్ఞానము లేకపోయినచో మానవుడు దేనియందును ప్రవర్తిం పడు. కామన నానావిధముల నుండును. కామనాభేదమున ప్రవృత్తి భేదము కల్గును. మానవుని ప్రవృత్తియందు అనేక విధములగు నుపాయము లపేక్షితములు. ఉపాయభేదము వలన వ్యాపారభేదము సిద్ధమగుచున్నది. కామనాసిద్ధి యున్న ప్పుడే దేవతానుగ్రహము కలుగును. అట్టి అనుగ్రహ సంపా దనకు మానవుడు ప్రయత్నింపక తప్పదు. ఆ ప్రయత్నమే ఉపాయమని సాధనమని తంత్రమని చెప్పబడుచున్నది. తంత్ర గ్రంథము లన్నియు బ్రహ్మకాండ శేషభూతములు. తంత్ర ములు బహురూపములై యున్నవి. అనేక తంత్రములందు చెప్పబడిన విధానము లోక మానవునకు అనుష్ఠానశక్యములు కావు. ఏదియేని నియతానుష్ఠాన మావశ్యకము. అట్లను ష్ఠానమందు నియతత్వమును సంపాదించుటకు గురుసమ్మతి

మగు అర్థమునే కర్తవ్యముగా తలచవలయును. మానవునకు సహజముగా సుఖాకాంక్ష ఉండును దుఃఖ నివృత్తియు మానవున కభిలషితము. అది స్వాభావిక ప్రవృత్తి. సుఖము కల మానవుడు సుఖమును ప్రసాదింపగలడు. నిత్యసుఖ రూపుడైనట్టి పరమేశ్వరుని అనుగ్రహమును సంపాదించుటకు మానవుడు తంత్రోక్త సాధనను స్వీకరింపవలయును. సహజముగా మానవప్రాణికి జన్మసిద్ధమైన స్వభావ పరిశుద్ధత ఉండును. ఆస్వాభావిక పరిశుద్ధియే దేవతానుగ్రహమునకు అర్హతను సంపాదించును. అట్టి యర్హత క్రమక్రమముగా అభివృద్ధిపొందుట సహజము. దాని నభివృద్ధి పొందించుకొనుటకు మానవు డనేకవిధముల ప్రయత్న మొనరింప వలసి యున్నది. అట్టి ప్రయత్నములచేత పరిపూతమైన జన్మసంశుద్ధి దేవతాస్వరూపమును అంతరంగములో అవభాసింపచేయును. ఇది ఆస్తికమగు భావము. దేవుడు కలడని వేదాగమలు ప్రమాణములని తన కవి మార్గప్రదర్శకములని నిశ్చయించినప్పుడే కలుగవలసిన ఫలము కల్గును. శ్రద్ధావిశ్వాసములుకల జీవుడే ఉత్తమగతిని పొందుట కర్హుడు. ఆతడే లోకసంగ్రహ మొనర్ప గలధీశాలి. తాను తరించి ఇతరులను తరింపచేయ గలడు.

పరమేశ్వరుని స్వభావము స్వరూపస్థితి ఎట్టిదో నిశ్చయింప జాలము. రాగగోచరమైనట్టి ఆతత్వము ప్రవృత్తి ననుసరించి తెలియవలయును. ప్రకృతియే పరమేశ్వరుడు కాడు. అయినను పరమేశ్వరుని తెలియచేయుటకు ప్రకృతియే సమర్థము. కావున మానవుడు కేవలము ప్రకృతిపరాయణుడు

శ్రీ

కాక ప్రకృతిలక్ష్యభూతుడైనట్టి పరమేశ్వరుని అన్వేషింపవలసి యున్నది. అట్టి యాతని అన్వేషణలో ప్రకృతిని అనుసరించుట తప్పదు. ప్రకృతియే పరమేశ్వరి. పరమేశ్వరుని అంశమే ప్రపంచగతిని పొందినదని కొందరి సిద్ధాంతము. శాక్తవాదులును ఈనిర్ణయమునకు దూరస్థులుకారు. పరమేశ్వరునకన్న పరమేశ్వరికి భేదములేదు. ఒకేవిధమగు తత్వము సర్వరూపగతి విచిత్రతనుబట్టి వేరువేరుగా చెప్పబడుచున్నది. భేదాభేద సిద్ధాంతము శాక్తదర్శనమునం దూహింపవచ్చును ఆత్మాంశము జగద్రూపమున వివర్తించినదని గ్రహింపవచ్చును. సర్వసామాన్యముగా గోచరమగునట్టి చేతనాంశమంతయు ఆత్మయని జడాంశమంతయు ప్రకృతియని గ్రహింపవలయును. నామరూపములు ప్రకృతియందేయున్నవి. ప్రకృతియందలి నామరూపములకు నామత్వ రూపత్వములను సంపాదించునది నిత్యచేతనమగు పరమాత్మతత్వమే. కేవల జడమునకు స్పందించు శక్తిలేదు. కేవల చేతనమునకు జగద్రూపత్వము నొందు స్వభావములేదు. ఈ రెండింటి కలయికలో బ్రహ్మాండము లన్నియు సంభవించినవి. నిఖిలవిశ్వములోని ఏవస్తువు నందైనను జడచేతనముల పరస్పర సమన్వయము కన్పడుచున్నది. సమీకృతమగు శక్తియే శ్రీశక్తిగా చెప్పబడును. ఉభయాత్మకమైన అఖండతత్వము సర్వోపాస్యస్వరూపిణి మహాదేవి అనబడును. ప్రకృతి పదమునకు ప్రకృష్టమగు కృతి అని అర్థము. సృష్టియందు ప్రకృష్టమగునది ప్రకృతి యగుచున్నదని పరమార్థము. ప్రకృతి త్రిగుణాత్మకమై యున్నది. అందు

మాధవ

సత్వరజస్తమోగుణములు కలవు. ప్రకృతిపదములోని అక్షర త్రయముక్రమముగా గుణత్రయముచెప్పునని కొందరు నిర్దేశించుచున్నారు. సృష్ట్యాదియందును ఉండుటనుబట్టి ప్రకృతి యనియు వ్యపదేశింపవచ్చునని పెద్దలు పలుకుచున్నారు. ప్రకృతి స్త్రీస్వరూపిణిగా ఆత్మ పుంరూపముగా నిర్దేశించుట అందరకు విశదమై యున్నది. ఉపాస్య దేవస్వరూపము స్త్రీ పుంసాత్మకమగు అఖండశక్తి. "పుం రూపం వాస్మరేత్ దేవి స్త్రీ రూపం వా విచింతయేత్ అథవా నిష్కలం ధ్యాయేత్ సచ్చిదానందలక్షణం" శ్రీశక్తిస్వభావమును పుంరూపమున ధ్యానింపవచ్చును. స్త్రీరూపమున ధ్యానింపవచ్చును. రెండిటికతీతముగనైన ధ్యానింపవచ్చును. ఆదేవీస్వరూపముమాత్రము సచ్చిదానంద లక్షణము. "సత్వంబపురుషో నచాంగనాచిత్స్వరూపిణి! నషండతాపి తే. నాపిభర్తురపి తే త్రిలింగతా త్వాంవినా నతదపి స్ఫురేదిదం" దేవీ! నీవుపురుషుడవుకావు. అంగనవు కావు. షండత్వమును నీకులేదు. పరశివునకును స్త్రీపుంనపుంసకత్వము లేదు. నీవు వినా అతనికి స్వరూపప్రకాశమే లేదు. నీవు చిత్స్వరూపమవు. ఈవిధమున పరమేశ్వరీయరూపము నిర్ణీతమగుచున్నది. కాబట్టి పరమేశ్వరిని ఉపాసించువారు స్త్రీల నుపాసించెడివారని లోకమనుకొనుట పొరపాటు. లోకమున పురుషులనబడువారియందు కేవల పురుషత్వములేదు. స్త్రీలనబడువారియందు కేవల స్త్రీత్వములేదు. స్త్రీలయందలి చైతన్యాంశము పురుషత్వమును సూచించును. పురుషులలోని జడాంశము

స్త్రీత్వమును సూచించును. జడమునకే నామరూపము లున్నవి కావున శరీర విలాసమంతయు ప్రకృతి రూపమని స్త్రీ స్వభావమని గ్రహింపవలయును. వీని కన్నిటికిని ఆత్మయే స్వరూపసంపాదన మొసర్చుచున్నది. కాబట్టి ఆనిత్య విశుద్ధ చేతనమే సద్రూపమగు ఆత్మ. ఉభయ సమరసాత్మకమైన ఉపాస్యదేవి త్రిపురసుందరి అని చెప్పబడుచున్నది. పరశివుడు త్రిపురుడు. ఆతని శరీరము మూడువిధములైనది. ఊర్ధ్వ భాగము బ్రహ్మ. మధ్యభాగము విష్ణువు. అధోభాగము శివుడు. ఇట్టి ఆపరశివుడు త్రిపురుడు. ఆతని సుందరి త్రిపుర సుందరి. బ్రహ్మ విష్ణు మహేశాత్మకమైన మూడు పురము లకు అధిష్ఠానదేవియై విరాజిల్లుచున్నది. కావున మహాదేవి త్రిపురసుందరి యనబడును. మేరుశిఖరాగ్ర భాగమున త్రికూటమున విరాజిల్లునదియై ప్రకాశించుటను బట్టియు త్రిపురసుందరి యగుచున్నది. మానవుని శరీరమందంతటను దేవీవిలాస మనుగతమై యున్నది. పాదాదినాభ్యంతము ఒకటి కంఠాంతము రెండవది. కంఠాది సహస్రారాంతము మూడవది. ఈమూడును పురములు. వీనియందు సంచరించు దేవి యగు టచే త్రిపురసుందరీదేవి అనబడును. అంతియేకాక జాగ్ర త్స్వప్న సుషుప్త్యవస్థలలో భాసించునది యగుటను పై నామము సముచితము. మాతృమేయమానాత్మకమగు తత్వము ఆపరమేశ్వరియందుండుటచేతను త్రిపురసుందరీ నామము సార్థకమగుచున్నది. సదాత్మకమైన విజ్ఞానము ధ్వని రూపమగుట అదియే వేదమగుట దాని వికాసక్రమము నను

సరించి మంత్రయంత్ర దేవతాసిద్ధి కల్గుట నిరూపితప్రాయము. తత్ప్రాప్తికొరకై తంత్రములను తదుక్తసాధనములను స్వీకరింపవలయును. కేవల తాంత్రిక విధానము సముచితముకాదు. కేవల వైదికమునందు ఉపాసనా విశేషములు తగినట్లుగా నిరూపితములై లేవు. కావున తాంత్రికములకు వైదికత్వమును సంపాదించి స్వీకరించుట ఉచితమగు విధానము. వైదిక తాంత్రికకర్మలకే లోకసంగ్రాహకత్వ మున్నది. అనుసరించు వారిని తరింపచేయు సామర్థ్యమున్నది. ఒకప్పుడు దేవాసుర సంగ్రామమున బ్రహ్మప్రభావమువలన దేవతలు విజయము పొందిరి. అది తమ ప్రభావమేనని వారు అహంకరించిరి. ఆ అహంకారము నణచుటకు ఒకభూత మచటకు వచ్చెను. అగ్ని వాయువులు కనుగొనుటకు ప్రయత్నించి విఫలులైరి. ఇంద్రుడు ప్రయత్నించెను గాని భూతము కన్పడలేదు. అతడు లజ్జితుడై విమర్శశక్తి నారాధించినాడు. హైమవతి సాక్షాత్కరించినది. ఆమె చెప్పినపిమ్మట ఇంద్రునకు ఆత్మావబోధ కల్గినది. ఈ విధానమున నట్టి ఆత్మబోధకై అంతఃశక్తులను వికసింప చేసి. కొని త్రిపురసుందరి నారాధింప వలయునని గ్రహింప వలయును. శ్రీశక్తి నుపాసించుటకు విశేషము లపేక్షితములు. ఆయావిశేషములను సంప్రదాయములందు గ్రహింపవలయును. సంప్రదాయపరిశుద్ధి లేకపోయినచో ఉపాసనకు రాణింపు కలుగదు. లోక సంగ్రహము సిద్ధింపదు. ఆదికాలమునుండి అనూచాన సిద్ధముగా సంప్రదాయము ప్రవర్తించుచున్నది. దానిననుసరించుట సాధకున కవశ్యకర్తవ్యము. సంప్ర

దాయాగతమైన విద్యయే ఉపకరించునది యగును. అవిచ్ఛిన్నమగు గురుశిష్యపరంపర సంప్రదాయ మనబడును. అసాంప్రదాయికముగా విద్య లలవడవు. ఒకచో ఎట్టివిధాన మునైన విద్య సంప్రాప్తమైనను అది ప్రభావ సంపద కలది కానేరదు. భారతగ్రంథమునందు అసాంప్రదాయికముగా సిద్ధమైన వేదవిద్య ఫలప్రదము కాజాలకపోయినదని సూచించుటకు అనేకగాథలు వర్ణింపబడినవి. సద్గురు సన్నిధానమునందు యోగ్యశిష్యత్వము కల మానవుడు విద్యనుగ్రహింపవలయును. అందును శ్రీవిద్యావిషయమై సంప్రదాయపరీక్ష అత్యంత మవసరము. శ్రీవిద్యాగోష్ఠిలో శక్తిపాతమొకటి ప్రధానముగా చెప్పబడుచున్నది. ఆది గురువునుండి అవిచ్ఛిన్న పరంపరానుగతమై శక్తిప్రసారమున్నట్లు మాంత్రికులు చెప్పుచున్నారు. మధ్యలో సంప్రదాయము విచ్ఛిన్నమై పోయినచో శక్తిపాతము అడ్డుపెట్టబడును. అందువలన ఆయా విద్యాప్రయోజనములు కలుగనేరవు. కావుననే విద్యోపాసనచేయువాడు యత్నమున మంత్రమును దాచిఉంచవలయుననియు ధీమంతుడై గురుపాదుని స్పష్టముగా చెప్పుకొనవలయుననియు సంప్రదాయవిదులు పలుకుచున్నారు. యోగ్యమగు సత్సంప్రదాయము నేటికాలమున భారతదేశమందు విలుప్తమైయున్నదనుట లజ్జాకరము. అసాంప్రదాయికములగు ఉద్బోధ లతిశయించుటవలననే లోకమున భిన్నమర్యాద లేర్పడినవి. వానినన్నిటిని సంప్రదాయ పరిపూతమొనర్చినచో . చక్కగా లోకసంగ్రహము కలుగగలదు. సంప్రదాయరహస్యము విస్పష్ట

ముగా తెలియుటకు గురువరేణ్యుని అన్వేషింపవలయును. తన ప్రాకృత పుణ్యపరిపాకమున యోగ్యగురుసేవ లభించును. సామాన్యమానవుడు కేవల బుద్ధిప్రజ్ఞతో గురువును అన్వేషింపక జాలకపోవచ్చును. అయినప్పటికి ఆతనికి సంప్రదాయమం దభిమానమున్నచో ఉత్తమగురుపాదుని అనుగ్రహము స్వప్నమునం దుపలబ్ధమగును. ధనముచేగాని అభిమానముచేగాని గురువును నిశ్చయింపరాదు.

శ్రీవిద్యాబోధకములైన సంప్రదాయ గ్రంథములలో గురుస్వరూపము అనేకవిధముల నిర్దేశింపబడుచున్నది. గురువు, ఆచార్యుడు, ఆరాధ్యుడు, దేశికుడు, స్వామి, మహేశ్వరుడు, శ్రీనాథుడు, దేవుడు, భట్టారకుడు, ప్రభువు, యోగి, సంయమి, తపస్వి, అవధూత, వీరుడు, కౌలికుడు, సాధకుడు, భక్తుడు మొదలగు నామములతో గురుదేవుని శాస్త్రములు నిర్దేశించుచున్నవి. అంధకారము నిరోధించువాడు గురువని శబ్దార్థము. గురుపదములోని రెండక్షరముల మొదటియక్షరమునకు అంధకారమనియు, రెండవయక్షరమునకు నిరోధకుడనియు నర్థము. అవిద్యామయమగు అజ్ఞానము అనాదికాలము నుండి మానవుని ఆవరించియున్నది. అట్టి అవిద్యాంధకారము పోగొట్టునాతడే గురువగుచున్నాడు. పాపములను దహింపచేసి సిద్ధులను సంపాదింపచేసి జ్ఞానమును ప్రకాశింపచేసి స్వరూప స్థితిని సంపాదించు మహనీయుడే గురువగును. గుహ్యరూపమగు అర్థమును బోధించుటనుబట్టియు, రుద్రాదిరూపుడౌటను, గురువగుచున్నాడని ప్రామాణికులు నిర్వచింతురు. గుర్వా

దులను స్మరణచేయునపుడు శ్రీ పూర్వకముగా స్మరింపవల యునని సంప్రదాయ నిర్దేశము. శ్రీ గురువును పేరుతో నెన్నడు నుచ్చరింపరాదు. తన నామమును తనగురునామమును తండ్రి నామమును అన్నపేరును భార్యపేరును భర్తనామమును తన జ్యేష్ఠకుమారుని నామమును తా నుచ్చరింపరాదని ధార్మిక సందేశము. అట్లే తన ఇష్టదైవమునుకూడ వెంటనే స్పష్టము చేయరాదు. ఈ పైచెప్పబడిన వ్యక్తులు తనకు సర్వవిధముల ప్రేమాస్పదులు. సర్వనామములు సర్వవ్యవహారములు తనతో సంబంధించిన నిఖిలమును ఆవ్యక్తికి సంబంధించునని తన ఊహ. కావున ఒకే నామమును వ్యవస్థితముకాదు. సర్వనామములచే చెప్పతగిన భావసామాన్యమందు తన ఇష్ట భావమే గోచరింపవలయుట ఇందు ముఖ్యనిర్దేశము. అందును శ్రీవిద్యోపదేష్ట అయినట్టి గురుపాదుని విషయమై ఈ నియ మము అత్యంతము పాలనీయము. గురుదారాపుత్రాదులను నిందింపరాదు. వారియందు సర్వవిధముల ఏద్వేషమున్నను సహింపవలయుననుట ఇచట పరమార్థముకాదు. తక్కిన విష యముల నన్నిటికంటెను ఏ విధానము నవలంభించి తాను శ్రీగురువును సేవించెనో ఆవిధానమునందే ముఖ్యభావము నుంచుకొనవలయును. ఏమాత్రమును అందు న్యూనత్వమును కలుగచేసికొనరాదు. అని పరమ తాత్పర్యము. తన గురువును నిందించువారిని తాను సహింపరాదు. శ్రీగురుభక్తియే ప్రధానమని చెప్పుటకై అనేకవిధములగు అర్థవాదలు ప్రశం సావచనములు చెప్పబడినవి. గురునిందకుని చంపినచో పర

మాధవ

శివైక్యము కల్గునని గ్రంథములందున్నది. అచటి ఆవాక్యము నకు గురునిందను తాను వినరాదు అనియే తాత్పర్యము. బుద్ధిమంతుడగు మానవుడు గురువును ప్రకాశముగా చెప్పుకొనవలయును. ప్రకాశము చేసికొనకపోయినచో తనకుదోషము వాటిల్లును. గురుసంప్రదాయానుగతము కానట్టి విద్యకు రాణింపులేదు. గురువు సాక్షాదీశ్వరుడు. తన గురుపాదుడేమంత్రము నుపదేశించుచున్నాడో ఆమంత్ర మునందు ఆ గురువు సిద్ధిని పొందినవాడై యుండును. మంత్రసిద్ధిని పొందిన మానవుడు మంత్రదేవతా రూపుడు. కావున గురువును పరశివుడని భావింపవలయు. గురువుని మర్త్యునిగా తలచరాదు. గురుసన్నిధానముననున్నప్పుడు ఇత రులను పూజింపరాదు. గురురూపమున శివాకృతిని శిష్యుడు గ్రహింపవలయును. గురుదేవతాత్మలకు ఐక్యభావన చేయుట శ్రీవిద్యాసాంప్రదాయమం దుత్తమభావము. తనకు సర్వవిధముల ఆరాధ్యమగునట్టి పరమదైవమును గురురూప మున భావింపవలయును. ఉత్తమమైన భావనాపద్ధతిలో పరి పక్వమగు అంతరంగముకల యాతడే విద్యాగ్రహణ సమర్థు డగుచున్నాడు.

దీక్షనిచ్చుటకు సమర్థుడగు మానవుడే గురుపీఠమున నుండనర్హుడు. శిష్యునకు దీక్ష మంత్రాధికారము నిచ్చు చున్నది. దీక్షలు నానావిధములుగా చెప్పబడుచున్నవి. శాక్తశాంభవాది దీక్షలనిచ్చుటలో శక్తిపాతమొనరించుటలో సమర్థుడగునాతడే శ్రీవిద్యాదేశికుడగును. జాగ్రదాది పంచ



మాధవ

కమును తెలియునాతడే గురువు. సర్వావస్థలందును ఏకరూపానుగతమై భాసించునట్టి ఆత్మసంవేదనమును తెలియునాతడే ఉత్తమదేశికుడు. లక్ష్యానుసంధానమును ఆత్మానుసంధానమును నాదానుసంధానమును చేయగలుగువాడే శ్రీగురువు. పరాపశ్యంతీ మధ్యమా వైఖరీరూపమగు వాక్చతుష్టయమును స్పష్టముగా నెరుగజాలినవాడే శ్రీవిద్యాచార్యుడు కాగలడు. యోగశాస్త్ర ప్రసిద్ధములైన మూలబంధ ఉడ్యాణబంధ జాలంధర బంధములను స్పష్టముగా ఎరుగజాలినయాతడే మంత్రమహేశ్వరుడగుచున్నాడు. మంత్రముల ప్రయోగోపసంహారవిధులను స్పష్టముగా ఎరిగియున్న నే గురుపదమున వ్యపదేశింపనర్హుడు. యంత్రమంత్రతంత్రసాధనలందు పరిపూర్ణ ప్రజ్ఞావిలాసితుడై వానిపరమార్థమునంతను తెలిసికొనజాలినవాడై స్వార్థాహంకారములులేక ప్రవర్తించు మానవుడు శ్రీగురుపీఠమునందు శోభితుడగును.

శిష్యునకును అనేక లక్షణములు నిర్దేశింపబడినవి. పరమార్థసాధనయందు పట్టుదలగల్గి స్వార్థములేక ప్రయత్నించు సాత్వికగుణసంపన్నుడు శిష్యుడు కాదగును. మున్ముందుగా మానవుడు తనయందు శిష్యత్వమును పరిశోధించుకొని తత్క్షణమున జాగరూకుడై ప్రవర్తించి గురూపసదన మొనరింపవలయును. ఉత్తమగురు సన్నిధానమందు యథావిధిగా మంత్రదీక్షను స్వీకరింపవలయును. మంత్రము నారాధించువాడు మంత్రి అగుచున్నాడు. మంత్రమును అనేకవిధముల మానవులు సాధింపవచ్చును. కాని ఉత్తమగురు సన్నిధిని

మాధవ

శక్తిపాతపూర్వకముగా గ్రహించుటయే ఉత్తమవిధి. పుస్తకమున మంత్రమునుచూచి గ్రహించి జపించుట ఉచితము కాదు. ఎవనికో ఉపదేశించు మంత్రమును చాటుననుండి గ్రహించి జపించరాదు. శ్రీకృష్ణు డర్జునునకు గీత నుపదేశించెను. ధ్వజాగ్రముననున్న హనుమంతుడు గురునాజ్ఞ లేకనే ఉపదేశమును స్వీకరించినాడని పిశాచమగునట్లుగా శపింపబడినట్లు కథలు చెప్పుచున్నవి. స్వప్నమునందు మంత్రముపలబ్ధమైనను గురుసన్నిధానమునుండియే స్వీకరింప వలయుట శాస్త్రచోదితమగుచున్నది. అప్పుడే సంప్రదాయ పరిశుద్ధి ఉన్నట్లు గ్రహింపవలయును. సంప్రదాయపరిపూత ములు కానట్టి మంత్రములను జపించినను అట్టియాతడు మరల ఇతరుల కుపదేశించుటకు గురుపీఠమున విభ్రాజితు డగుటకు అర్హతకలవాడు కాడు. తనయందలి విద్యలకు గురువు లేక పోయినచో హానియున్నది. గురువులేని యాతడు గురు మండల రూపిణియైన శ్రీదేవి నారాధించుటకు యోగ్యుడు కాడు. శ్రీచక్రమునందు గురుస్థానము ప్రత్యేకముగా నిర్దేశింపబడియున్నది. గురుసంప్రదాయ విహీనుడు శ్రీ చక్రారాధన మొనర్చుటకు అర్హుడు కాడు. ప్రతి మంత్ర జపము నందును ప్రతి యంత్రారాధనమందును గురుపూజ ప్రధాన విహితమై యున్నది. గురురహితుడు ఆవిధానము ననుష్ఠించుటకు అర్హుడు కాజాలడుగదా, అదియుకాక మంత్రదీక్షలో శక్తిపాతము ముఖ్యముగా ఎన్నబడుచున్నది. గురువు లేక పోయినచో శక్తిపాత విధానము జరుగదు. ఉత్తమసాధకుడగు

వాడు తనయంతట తాను తనలోని శక్తులను వికసింప చేసి కొనవచ్చును గాని దీర్ఘకాలమున గాని అట్టి ప్రభావము కలుగదు. శ్రీగురువే యున్నచో అట్టి తనలో నిగూహితమై యున్న శక్తి వెంటనే వికాసము పొందును. తద్వికాసాను సారముగా జన్మాంతర విశేషమును సాధకుడు వెంటనే గ్రహించుట కవకాశ మున్నది. నానావిధములగు దీక్షావిశే షములవలన కాని తనయందలి శక్తి వికాసము పొందదు. అట్టి దీక్షల అనుగ్రహము గురుపాదునివలన కాని సిద్ధింపదు. కావున గురువు నారాధించుట యనునది అవశ్యముగా మానవున కపేక్షితమై యున్నది.

దీక్షావిశేషమున మానవునియందు నిగూఢమై యున్న శక్తులు వికాసము పొందును. ఆశక్తి వికాసాను గుణముగా సముచితమగు సాధనయొనర్చినచో సాధకుడు ధన్యుడు కాగలడు. ఆదికాలమునుండి శ్రీగురువునందు సంప్రదాయా గతమై సిద్ధముగానున్న శ్రీశక్తి దీక్షాసమయమందు శిష్యు నిలో ప్రవేశించును. దానివలన అపూర్వమైన జాగృతి కల్గు చున్నది. సామాన్యముగా ఈదీక్ష స్పర్శదీక్ష దృగ్దీక్ష మానస దీక్ష అని మూడువిధముల నున్నది. పక్షులు తమ సంతాన మును స్పృశించి అభివృద్ధి పొందించుచున్నవి. అట్లే గురువు స్పర్శతో శిష్యుని అనుగ్రహించును. మత్స్యములు తమ సంతానమును దృష్టిప్రసార మాత్రమున పెంపు పొందించు చున్నవి. ఆవిధముగనే గురుకటాక్ష ప్రసారమున శిష్యునకు ధన్యత్వము కల్గును. తాబేలుజాతి తన సంతానమును మనో

మాధవ

వీథిలో స్మరించును. అట్టి స్మరణమాత్రముననే ఆసంతాన మభివృద్ధి పొందుచున్నది. ఆవిధముగనే శ్రీ గురుపాదుడు మనోవీథిలో శిష్యస్వరూపమును తలచి అనుగ్రహించును. ఈ చెప్పబడిన దీక్షలలో పూర్వపూర్వముకన్న ఉత్తరోత్తరము ఉత్తమమగుదీక్ష. శంకర భగవత్పాదుడు తోటకాచార్యుని మనోవీథిలో స్మరించి అనుగ్రహించినంత మాత్రమున సకలవిద్య లనుక్షణములో భాసించినవి. గురుశిష్య సంప్రదాయమందు దీక్షావిశేషములు అనంతములుగా నున్నవి. కుండ మంటపాదు లను నిర్మాణముచేసి సకలవస్తుసామగ్రితో దీక్షను నిర్వర్తించుట క్రియాదీక్ష యనబడును. ఇది ఎనిమిదివిధములుగా నున్నది. అక్షరాత్మికమైన దేవీస్వరూపమును గురుపాదుడు భావనచేసి శిష్యునిదేహమందు ఆయా అక్షరవిన్యాసముచేయుట వర్ణ మయీదీక్ష. ఈదీక్షయు సృష్టిస్థితి సంహారరూపమున త్రివిధముగానున్నది. కళాదీక్ష వేరొకటికలదు. పాదములు మొదలుకొని జానుపర్యంతమును, అదిమొదలు నాభ్యంతము, తదాది హృదయాంతమును, అచటనుండి కంఠాంతమును, అచటనుండి భ్రూమధ్యాంతమును, ఆప్రదేశమునుండి సహ స్రారాంతమును, ఆయా పరమేశ్వరీకళలను సమంత్రకముగా శిష్యదేహమందు సంక్రమింపచేయుట కళామయీదీక్ష అన బడుచున్నది. ఇదియు త్రివిధముగానున్నది. ఇట్లే స్పర్శదీక్ష వాగ్దీక్ష, దృగ్దీక్ష తీవ్రతరముననున్న మనోదీక్ష, కులదీక్ష అని దీక్షావిశేషములు కలవు. 32 దీక్షలు తాంత్రికవిధానము లందు తెలియతగియున్నవి. ఆయాదీక్షల విన్యాసపద్ధతి గురు

శ్రీ

సంప్రదాయమునందు తెలియతగియున్నది. మంత్రామ్నాయములతో కూడుకొనియున్న ఈదీక్షారహస్యములు సవిశేషముగా తెలిసినప్పుడు సాధకునకు ధన్యత్వముకల్గును. ఇట్టి దీక్షలను తానుగ్రహించుటకు గురుపాదసేవన మపేక్షితము. దీక్షారహితుడైన సాధకునకు యోగ్యత్వములేదు. ఒక గురుసన్నిధానమున మంత్రమును స్వీకరించి దీక్షనుగ్రహించులోపున ఆగురువు గతించినచో గురుపుత్రుని సన్నిధానముననైన దీక్షను స్వీకరింపవలయును. గురుపుత్రునకు దీక్షనిచ్చు అర్హతలేకపోయినచో గురుసన్నిహితులగువారి సన్నిధానముననైన దీక్షనుగ్రహింపవచ్చును. లేదేని ఆసంప్రదాయముననే అవశ్యము దీక్షనుస్వీకరింపవలను. దీక్షాగ్రహణమునకై ఎన్నియేని ప్రదేశముల నన్వేషింపవలయునని ప్రయత్నింపవలయునని, సంప్రదాయగ్రంథములు చెప్పుచున్నవి, ఎట్లైన దీక్షగైకొనుట శ్రీవిద్యోపాసకునకు ముఖ్యకర్తవ్యము. దీక్షాహీనుడు ఎట్టివాడైనను యోగ్యుడుకాడు. దీక్షితుడైన చండాలుడైనను యోగ్యుడుగా తలచబడుచున్నాడు. చండాలునకును దీక్షయున్నదనుట కేవలము అర్థవాదముకాదు. చండాలునకును వానియర్హతానుసారముగా దీక్షయున్నది. అనేకయువతులు దీక్షితలై శ్రీవిద్యోపాసనచేసినట్లు శ్రీదేవి అనుగ్రహముపొందినట్లు ప్రసిద్ధముగానున్నది.

దీక్షాసమయమున సాధకునిశరీరమందు కుండలినీశక్తి జాగరణముకల్గును. ఈవిశేషమే శక్తివేధ అనబడుచున్నది.

మాధవ

ఆతని దేహమందున్న షట్కమలములు వికాసము పొందును. సుషుమ్నా నాడియందు శక్తిసంక్రాంతి కల్గును. ఈవిశేషమే శక్తి వేధ అనబడుచున్నది. శక్తి వేధను సంపాదించి శిష్యుని గురువు తనభూమికయందు ప్రతిష్ఠితుని చేయుచున్నాడు. "మమ వ్రతేతే హృదయందదామి, మమచిత్త మనుచిత్తం తేఅస్తు మమవాచం ఏకమనాజుషస్వ బృహస్పతిస్త్వానియునక్తు" గర్భస్థ మగు శిశువునకును దీక్షావిధి యున్నది. ప్రహ్లాదుడు లీలా వతీ గర్భమున దీక్షితుడైనాడు. సుభద్రాగర్భమున అభిమ న్యువు పద్మవ్యూహ విభేదమున మంత్రదీక్షాదీక్షితుడైనాడు. సాధకాత్మకు ఈదేహమంతయు గృహము. పాంచభౌతిక మగు ఈదేహము తల్లిదండ్రులచే సంపాదింపబడుచున్నది. "నవద్వారేపురే దేహీ హంసోలోలాయతే బహిః" నవద్వార మయమైన ఈ దేహమునందు దేహిఅనబడు ఆత్మ సంచరించు చున్నాడు. శ్రీశక్తి నారాధించుటకు పాంచభౌతికమైన దేహప్రభావము సమర్థముగాదు. ఉత్తమమగు విద్యామయ శరీర మపేక్షితము. అట్టిదేహమును సంపాదించుటకు గురు పాదాశ్రయణము అవశ్య కర్తవ్యము. చక్కని గృహమును సంసిద్ధము చేయుటకు సమర్థుడైన ఒక ఇంజనీయరు కావలసి యున్నది. ఆకర్మాధ్యక్షుని పర్యవేక్షణమున సౌధము సుందర మగును. అట్లే శరీరసౌధసుందరత్వమునకు శ్రీగురువను కర్మా ధ్యక్షు డవసరము.

మానవునకు వంశము ద్వివిధముగా నున్నది. ఒకటి కుటుంబమునకు సంబంధించినది. వేరొకటి విద్యావంశము.

శ్రీ

విద్యావంశమే మానవునకు ప్రధానము. ఆవంశమునందే మానవునకు మానవత్వము కల్గుచున్నది. మానసోల్లాసము సిద్ధమగుచున్నది. మామూలుగానుండు గురువుకన్న మంత్ర గురువు విలక్షణుడు. పురుషార్థసాధనసమర్థమగు స్వరూప మును మంత్రగురువు సంపాదించుచున్నాడు. "వయోధికుడే గురువు కావలయును" అనునట్టి నియమములేదు. దేవహూతి కపిలసంవాదము చూడగా తనకన్న అల్పవయస్కుడుకూడ విద్యాగురువు కావచ్చును అని తెలియుచున్నది. కపిలుడు తన తల్లియగు దేవహూతికి తత్వసంగ్రహము నుపదేశించి నాడు. సంసారతరణమునకు గురుపదద్వంద్వము సమాశ్ర యణీయము. భారతదేశమున ప్రాచీనకాలమందు కులపతుల మర్యాదలలో గురుకులముల గౌరవము ప్రసిద్ధికెక్కినది.

ప్రాతఃకాలమున నిద్రనుండి మేల్కొనగనే "సహస్ర దళమందు గురుపదపద్మదళమును భావింపవలయును. ఆత్మ యోగప్రణాళిక ననుసరించి తనకుండలినీశక్తిని పరమశివు డగు గురువునందు సంయుక్తము చేయవలయును. పంచ పూజ నాచరింపవలయును. గురుమంత్రమును జపింపవల యును అని సంప్రదాయ విశేషములు చెప్పుచున్నవి. గురుసన్నిధానమున యథావిధిగా మంత్రదీక్షను పొంది సాధ కుడు ఉత్తమార్హతను సంపాదింప గలడు. ఉత్తమదీక్షను పొందిన మానవునకు కాలక్రమమున దేవీదీక్ష సంప్రాప్తమగు నని తంత్రసారాదులలో చెప్పబడినది. శ్రీ దేవీస్వరూప ప్రతిపాదనముచేయు మహామంత్రము గురువనుగ్రహమువలన

మాధవ

శ్రీ

పొందినపిమ్మట సాధకుడు యథావిధిగా జపమొనరింప వలయును. జపముచేయు సాధకునకు ప్రభావవిశేష మున్న దని భారతమున జాపకోపాఖ్యానము చెప్పుచున్నది.

జపమొనరించువానికి శుచిత్వ మత్యవసరము. పరిశుభ్రమగు జపస్థానమున యథావిధిగా ఉపవిష్టుడై జపింప వలయును. ఆ యాస్థానమున సముచితములైన చిత్రముల నుంచవలయును. ఆసనవిధానమున కూడ ప్రత్యేకనియమము లున్నవి. సామాన్యముగా చేలాజినకుశోత్తరరూపమగు ఆసనవిధి అందరకును బోధింపబడుచున్నది. ఆస్తరణలేని భూమిపై కూర్చొని జపింపరాదు. తిరుగుచు నడచుచు పడుకొని జపించుట సముచితముకాదు. జపసాధనకు తగిన నియమాది విధానములను అవలంబింపవలయును. ఆస్తరణలేని భూమిపైకూర్చొని జపించుట నిషిద్ధమగుచున్నది. జాపకుని భారమును భూదేవి మోయజాలదు. ఆస్తరణముగా నుంచు నట్టివానిలో కూడ విశేషములు నిర్దేశింపబడినవి. పట్టువస్త్రము నాస్తరణముగాచేసి జపించినచో యోగికశక్తులు వికాసము పొందును. సామాన్య శక్తిగల సాధకులు వ్యాఘ్రాజినమున కూర్చొనజాలరు. ఇట్లే ఉత్తరోత్తరార్హతను సూచించు విషయము లున్నవి. ఆస్తరణమున ఉపవేశించుటయందును స్వస్తికాద్యాసనములు విధింపబడుచున్నవి. యథావిధిగా నిత్యానుష్ఠాన మొనరించిన పిమ్మట జపము చేయవలయును. జాతిసంప్రదాయ విహితములగు అనుష్ఠానవిశేషములను విడచి జపించు సాధకునకు అనుకూలఫలసిద్ధిలేదు. తన విహితకర్మను



మాధవ

త్యజించి ఎంతగా జపమొనరించినను ఫలములేదు. యథా విధిగా తన నిత్యానుష్ఠానము సంపూర్ణమైన యనంతరము జపవిధానమునకు ప్రయత్నింపవలయును. ఏ యే ఫలకాముడు ఏ యే దిక్కుగా కూర్చొనవలయునో నిర్దేశప్రతినిర్దేశము లున్నవి. ఉత్తరదిక్కు ముక్తిప్రదము. ప్రాచీదిశ శక్తిప్రదము. పశ్చిమదిశ భోగప్రదము. దక్షిణదిక్కు ఆభిచారక విధానముల కుపయోగించునదియగును.

సంఖ్యానరహితముగా జపమొనరింపరాదు. తాను చేయబోవునట్టి జపమును మొదటనే సంకల్పమునందు సంఖ్యతో చెప్పుకొనవలయును. "నేనీపూట ఇంత జపము చేయుదును" అనెడు నిశ్చయముండవలయును. జపమధ్య సమయమునందు దిక్కులు చూడరాదు. ఇతరులతో మాటలాడరాదు. తన లక్ష్యమును మరల్పరాదు. తాను చేయు జపమును సంఖ్యానించుటకై మాలను స్వీకరింపవలయును. స్ఫటికమాల, రుద్రాక్షమాల, తులసీమాల ఇవి ఉత్తమములు. ఆజపమాలనైనను సంప్రదాయ నియమానుసారముగా సంస్కరించి గ్రహింపవలయును. మాలాధారణమునందు సంఖ్యానసమయమందును అనుసరింపతగిన విశేషములు సంప్రదాయైక వేద్యములు. ఇట్లు మాలలోకాక తన కుడిచేతియందలి వ్రేళుల పర్వములతో సంఖ్యానము చేయుపద్ధతియు కలదు. అకారాది క్షకారాంత వర్ణమాలను ఆవృత్తిచేయుచు లెక్కపెట్టుటయు ఒక ఉత్తమసాధన. ఆవర్ణమాలానుసారముగా నిర్దేశింపబడిన విధు లనేకములున్నవి. వీని

యందు సృష్టిప్రక్రియ, సంహారప్రక్రియ కలదు. సామాన్యముగా జపవిధులలో సృష్టిసంహారప్రక్రియలను రెండిటిని జోడించుట సముచితము. తాను భావించు ఆయావర్ణములను ఇష్టదేవికి సంబంధించిన ప్రత్యవయవము లందారోపించుకొని జపించుటయు ఒక ఉత్తమప్రణాలిక. శ్రీదేవీరూపమును వర్ణమయముగాభావించుటలో ఈవిధాన ముపకరించును. ఇంతియే కాక తన భావనలో భాసించిన దేవీరూప గతములైన అవయవముల నేని ధ్యానించుచు జపసంఖ్యానము చేయుటయు ఉత్తమవిధానము. దేవీ స్వరూపమును వర్ణమయముగనే భావించి ఆయావర్ణవిన్యాసముతో సంఖ్యానించుటయు ఒక మహత్తరవిధానము. ఇట్లు సంప్రదాయ సమయములలో తెలియతగిన విశేషము లున్నవి.

సాధకుడు కాలత్రయమందును జప మొనరింప వలయును. అందును సాయంప్రాతస్సమయములు జప మొనరించుటలో సంఖ్య ఎంతగా ఉండవలయును? అను విషయమున నానామత భేదములున్నవి. ఒక్కొక్క మంత్రమునకు ఒక్కొక్క నియతమగు సంఖ్యతో సిద్ధియున్నట్లుగా గ్రంథములు చెప్పుచున్నవి. ప్రతిదిన మొనరించు జపసంఖ్య ఎంతగా నుండవలయును? అను ప్రశ్నకు ఆ యా సంప్రదాయములే సమాధానమును చెప్పుచున్నవి. అయినను ఈవిషయము నిచట గ్రహింపవలయును.

మంత్రజపమున సాధకునకు అంతరంగ సంస్కారము కల్గుచున్నది. ఆసంస్కారమునకు ముందుగా నాడీపరిశుద్ధి

కలుగును. దీనివలన యౌగికశక్తులు వికాసము పొందు చున్నవని అనుభవవిదులు చెప్పుదురు. సాధకుని శిరస్థ్సాన మున సహస్రారచక్ర మున్నది. ఆచక్రము సహస్రదళము లతో నుండు పద్మమువలె యున్నది. మంత్రజపమువలన కల్గిన సంస్కారము దేహానుగతమై సహస్రార భూమికలో సంబంధము పొందుచున్నది. కావున సహస్రార పద్మములోని దళసంఖ్యానుసారముగా సహస్రసంఖ్యాకమగు జపముచేయుట ఒక విధానమై యున్నది. కావుననే అకారాది క్షకారాంత వర్ణమాలను పదిపర్యాయము లావృత్తముచేసి యోగులు సహస్రారసంఖ్యకు సరిపుచ్చుకొను చున్నారు. శ్రీదేవీ నామావళిసహస్రసంఖ్యతో నుండుటయు సహస్రసంఖ్యకు ఇట్టి ప్రాధాన్యము గోచరమగుచున్నది. పూటపూటకు సహస్ర జపమొనరింపవలయుట విహితమగుచున్నది. అంతగాచేయు టకు సమర్థులు కానివారు శతసంఖ్యాకజపమును చేయవల యును. "త్రిశతంశతమేవవా" అను వచనమిందు ప్రమా ణము. అష్టోత్తరశతజపము చేయుట ఒక విధానమైయున్నది శివకేశవాదులకు సంబంధించిన నామావళియు ఈసంఖ్యతో ఒప్పారుచున్నది. సాధకుడు ప్రతిదినమును ౨౧౬౦౦ శ్వాస నిశ్వాసములను విడుచుచున్నాడు. రెండువందల సంఖ్యతో దాని విభాగింపగా ౧౦౮ సిద్ధమగుచున్నది. కాగా పర్యాయ మునకొక అష్టోత్తరశతము చొప్పున ఉదయము శతపర్యాయ ములును సాయంసమయమున శతపర్యాయములును జపమొన రించినచో శ్వాససంఖ్యా సమానాకారమున జపమొనరించి

నట్లగుచున్నది. ఈఅర్థమును హృదయమున భావించి సాంప్ర దాయికులు పైవిశేషమును నిర్దేశించి యుందురు. ఇచట నీయర్థమునుకూడ భావింపవలయును. శ్రీదేవీపాదద్యుతులు మేళనము పొందియున్నవి. అందు ఆగ్నేయకళలు ౧౦౮. మానవునకు ప్రథమమున అగ్నిదేవుడందుబాటులోనున్నాడు. కావున దేవీభావనచేయువారలకు తత్పాదకాంతుల సంఖ్యా సమానాకారమున జపవిధానము నిర్దేశించుట సూచించు చున్నారు. దేవీపాదద్యుతులలో సూర్యకళలు ౧౨౦ కాక పోయినను ఈవిశేషమును భావించవలయును. మాలినీవిజ యోత్తర తంత్రమందు సూర్యాకృష్టి విద్య ఉపదేశింపబడి నది. సూర్యమండలాంతర్వర్తిని అగు శ్రీదేవీస్వరూపమును ధ్యానించుచు ఆఆ కృష్టివిద్యను ఆరాధింపవలయునని సామయి కుల అభిప్రాయము. ఆవిద్యాసాధనప్రణాలిక ఆతంత్రగ్రంథ మందు స్పష్టముగా నిర్దేశింపబడినది. మొత్తముమీద నట్టి సాధనకు ఉత్తమసాధకుడు ౧౨౦ దినములు ప్రయత్నింప వలసియున్నదని అచటి నిర్దేశము. కావుననే సాంప్రదాయికులు కొందరు వర్ణమాలననుసరించి జపించుటలో ఆదిక్షాంత ముచ్చ రించి అ, క, చ, ట, త, ప, య, శ, లను ఉచ్చరించి, ఋ, ౠ, ఌ, ౡ విడచి ౧౪ స్వరముల పలికి శ, య, ప, త, ట, చ, క, అ, ఉచ్చారణ చేయుచు ళాదిగా అంత ముచ్చరింతురు. ఇట్లు సంఖ్యానవిశేషములున్నవి. కొంద రంతటి సంఖ్యతోనైన జపము చేయజాలక ఏబదిపర్యాయములు కొందరును నక్షత్ర సంఖ్యతో ౨౭ పర్యాయములు కొందరును పదిపర్యాయ

ములు కొందరును చేయుచున్నారు. ఇయ్యవి ప్రశంస నీయములు కావు. కాని జపసంఖ్యాన పద్ధతులలో తార తమ్యము లేదు. ఆయా అధికారికి ఆయావిధాన ముత్త మము. అధికారి విశేషమునుబట్టి విధానములందు విశేషము నూహించుట అసముచితము కాదు. వర్ణమాలానుసారముగా జపముచేయుట యుత్తమమని తలచవచ్చును. తదనుసారముగ చేయు జపములలో అనేకవిశేషము లున్నవి. వానిలో కొన్ని వివరింప బడినవి.

దేవీరూపమం:దు వర్ణవిన్యాసమును భావించుటయే కాక సాధకుడు తన దేహగతముగకూడ వర్ణములను భావించి జపింపవచ్చును. తన దేహమున సుషుమ్నానాడియం దను గతమైయున్న చక్రములందు వర్ణభావనచేయుచు జపింప వచ్చును. ఇట్లే వర్ణమాలానుసారముగా జపించు విధాన మున కల విశేషములను సంప్రదాయ పరిపాటిలో తెలియ వలయును.

## న్యాసము

జపము చేయుటకు ముందుగా సంకల్ప గురుధ్యాన, న్యాస, ధ్యేయ ప్రార్థనాది విశేషము లనేకము లున్నవి. న్యాసవిధానములేక జపమునకు పూనుకొనరాదు. మంత్రా క్షరములను భావనాపథమున భావింపచేసికొని తదక్షర

మాధన

సంఖ్యానుగుణముగా ఆవృత్తులతో జపించుటయు ఒకవిధానము. ఇట్లు మంత్రాక్షరములను భావనచేసిన తనదేహమున ఆయా అవయవములందు న్యాసముచేయుట న్యాసవిధి అనబడును. ఆ యా న్యాసవిధానమువలన సాధకునిశరీరము మంత్రమయమగుచున్నది. మంత్రమయమగు తనువును వహించినప్పుడే ఆయా మంత్రమును జపించుటకు అర్హుడగుచున్నాడు. జపాంగముగా పూజాంగముగా పారాయణాంగముగా న్యాసముచేయవలయుట సంప్రదాయధర్మము. న్యాసవిధానముకూడ దేవీభావనలో ప్రాధాన్యము పొంది యున్నది. తాంత్రికవిధానములలో కూడుకొనిన న్యాస విధులు ప్రత్యేకముగా తెలియతగినవైయున్నవి జపాంగముగా న్యాసముచేసికొనినపిమ్మట జపమధ్యమందు సాధకుడు లేచిపోరాదు. దానివలన మంత్రమయశరీరమునకు భంగపాటు కల్గునందురు. గర్భస్రావమువలె జపమధ్యమున లేచుట మహాపాపకార్యమని పెద్దలభావము. ఆ జపమధ్య సమయమున శ్రీ గురువుసన్నిధానమునకు వచ్చినచో తన ఆసనమునుండి లేచి అచటనే నిలువబడుట సంప్రదాయ ధర్మము. గురువుకాక ఇతరు లెవరువచ్చినను ఆసమయమున నమస్కరింపరాదు. శ్రీ దేవీభావన చేయువానికి ఇతరు లెవ్వరును ప్రధానులుకారు.

శ్రీ

# జపము

జపవిధానము లనేకము లున్నవి. వానిలో ఈక్రింది కొన్ని ప్రకారములు భావకులకు మనోహారములుగా నుండ వచ్చును. ఇచటి విశేషము విపులముగా మాతత్త్వసంగ్రహాము నుండి తెలియవచ్చును. నిత్యజప మవశ్యకర్తవ్యము. ఆపత్కాలమున కూడ దీనిని విడువరాదు. ఆశౌచాదికము సంప్రాప్తమైన సమయమునకూడ జపమును మానివేయ రాదు. ఉపదేశము పొందినపిమ్మట దినమునకు పదిపర్యాయములు తక్కువ కాకుండునట్లుగా అవశ్యము మంత్రమును జపింపలయును. "జాతాన్ త్రాయత్ తి జపః" ప్రపంచ ధర్మమున ఉత్పన్నమైన మానవుల నందరను పరిపాలించునది కావున జపమను నామము సార్థకము. 'యజ్ఞానాం జపయజ్ఞోస్మి' అని కృష్ణభగవానుని వచనము. దీనివలన జపయజ్ఞమునకుకల ప్రాధాన్యము విస్పష్టమగుచున్నది. సర్వ యజ్ఞములకన్న జపయజ్ఞము సులభమగునది కావచ్చును. జపయోగావలంబకునకు మహా ప్రతిభలు సిద్ధించును. వేద మంత్రమును ఆశించుటయే తపమని పరిగణించుచున్నారు. శౌనకుని ఋగ్విధానము ఈ విషయముల తెల్పుచున్నది. నియమానుసారముగా నిత్యజప మనుష్ఠించు సాధకునకు నిత్య దోషములు దూరీకృతము లగును. ప్రసన్నత సంప్రాప్త మగును. ధర్మశ్రద్ధ కల్గును. ప్రత్యవాయ వినాశమే నిత్యమునకు ఫలము.

ఎప్పుడో ఒకప్పుడు విశేషముగా చేయవలసినది నైమిత్తికజపము. పూర్ణిమ నవమి అష్టమి ఇటువంటి పర్వ తిథులందును శుక్రవారమందును ఉత్సవసమయములందును గ్రహణకాలమందును నైమిత్తికజప మొనర్పవలయును.

ఆర్తులగువారు అర్థార్థులగువారు కామ కాములు కామ్యజపము చేయుదురు. నిత్యనైమిత్తికములకన్న కామ్య జపమునందు పవిత్రత, నియమపరిపాలనము, సావధానత, జాగరూకత, ధైర్యము, మితాహారము, నియమరక్షణము, అత్యంతమావశ్యకములు. నియమసముదాయమున వ్యత్యస్తమైనచో హానికల్గును. కామ్యజప ముచితముకాదు. క్షుద్ర దేవతారాధనము అధికముగానుండును. దేవీసమారాధన చేయు మానవుడు 'దేవీప్రభావమును క్షుద్రములగు తన కోరికల పరిపూర్తికై వినియోగించుకొనరాదు.

అవిధిపూర్వకము, అనియమపూర్వకముగా, మంత్ర శుద్ధిలేక, సద్గురువులేక, శ్రద్ధలేక, దేవారాధనలేక, చేయు జపము నిషిద్ధజపము. ఇట్టిదానియందు హాని అధికముగా కలదు. ప్రాయశ్చిత్తజపమని వేరొకటి కలదు. అది దురిత నాశనమునకై చేయబడును. మానవస్వభావమున దోషములు సహజములు. దోషములకు తగినట్లుగా జపము చేయుట ఇందుండును. అచల జపము మరియొకటి. సంకల్ప పూర్వకముగా మానసస్వాస్థ్యము కల్గిన ఈ జపము నిర్వర్తింపబడును. దీనివలన గుప్తశక్తులు వికాసము పొందుచున్నవి. ఈ జపమైనపిమ్మట నిశ్చలత పాలింపబడును. దీనివలన



మాధవ

ఆధ్యాత్మిక వికాసము కల్గుట ప్రసిద్ధము. ఇది ఉత్తమమైన జపవిధానము. చలజపమని వేరొకటి కలదు. ఏసమయమున నైనను తానెట్లున్నను నామకీర్తనమువలె జపముచేయుట చలజపము. సత్యశుద్ధి పవిత్రతాదులు దీనియందు నియమములు. ఈ చలజపమున సమయసార్థకత కల్గుచున్నది.

వాచికజపమని మరియొకటి కలదు. మంత్రాక్షరముల నుచ్చరించుటలోని విశేషము వీనియందున్నది. మంత్రోచ్చారణ విధానములలో వాచికమైన జపము అధమమని కొందరందురు. విధియజ్ఞముకన్న దశగుణితమైన ఫలము దీనియందున్నదని మనువు చెప్పుచున్నాడు. ఈ జపమునందు యోగశక్తుల లాభము కల్గును. షట్చక్రవర్ణబీజవినియోగ లాభము కల్గును. వర్ణబీజశక్తులకు జాగృతి కల్గును. వాక్కు పరిశుద్ధిపొందును. ఉపాంశుజపము తరువాతిది. ఇందులో మనోమూర్ఛనమున్నది. ఏకాగ్రత అంతర్ముఖత ఇందవసరము. మెల్లమెల్లగా తనకు మాత్రమే విన్పడునట్లుగా జపించుట దీని స్వరూపము. వాచికజపమువలన కల్గు లాభము దీనివలనకూడ కల్గును. తపస్తేజము సిద్ధించును. స్థూలమునుండి సూక్ష్మము నన్వేషించుట ఇచట భాసించును. మస్తకమునందును లలాటమునందును ఉపాంశు జపానుభవము సాధకునకు గోచరము కాగలదు. భ్రమర జపము అత్యుత్తమమైన వేరొకవిధానము. దీనియందు ప్రాణగతి మందగించును. గుంజారవానుభవము దీనియందు కలదు. ఆధారమునుండి ఆజ్ఞాంతమువరకు నాదమనుసంధానింప

బడును. నాడీగతములైన చక్రముల విభేదనమున కిది ఉపయోగించును. ఇది చక్కగా అభ్యాసమునందున్న వారికి పూర్వజన్మస్మృతి కల్గును. తైజసపరమాణువులు గోచరించును. అనాహత సంగీతము విన్పడును. చేతనశక్తి స్ఫుట భావము పొందును. దివ్యజగత్తు ప్రతిభాసించును. మానస జపము వేరొకవిధానము. మంత్రార్థచింతనము దీనియందుండును. సగుణమునుండి నిర్గుణమునను సంధానించుట, నాద బ్రహ్మ ననుసంధానము చేయుట, దీనియందనుభూతము లగును. మొత్తముమీద మంత్రచింతనము నాదానుసంధానము ప్రకాశానుభవము దీని విశేషమునని గ్రహింపవచ్చును. మహాత్యాగియగు సాధకుడు అఖండ జపమును చేయును. ధ్యానము చేయగా చేయగా శ్రాంతి గల్గునేని జపమొనరింపవలయును. జపమొనరింపగా శ్రాంతుడైనచో ధ్యానమొనరింపవలయును. జపధ్యానశ్రాంతుడగుచో ఆత్మవిచారము చేయవలయును. ఈ విధాన మీ జపమున కలదు. శరీర యాత్రకు తగిన భోజనమును కూడ మాని, త్యాగులు ఈ అఖండజప మొనరింతురు. అజపాజపమని వేరొకటి యున్నది. ఈ జపము సహజము. ఇదియే హంసజపము. "దేవియే జపముచేయును. నేను దివ్యత్వము ననుభవించెదను" అని ఈ జపసాధకుడు భావింప గలడు. రావిచెట్టునకుకాని దేవాలయమునకు కాని గురుదేవునకు కాని ప్రదక్షిణము చేయుచు జపించుట ప్రదక్షిణ జపము. సామాన్యముగా జపముచేయునపుడు మంత్రాక్షర నాదమును భావనచేయుట

అత్యావశ్యకము. ఆవిధముగానే లక్ష్యమును నిరతముగ భావనచేయుచు ఆజప మొనరింప వలయుట ఆవశ్యకము. వీనియందు మంత్రనాదమునుకాని మంత్రార్థమునుకాని విడువ రాదు. లక్ష్యనాదాత్మలను అనుసంధానము చేయుచు జపించుట జపవిధానములలో అత్యుత్తమము. ఈ పైచెప్పిన జపపద్ధతులలో సాధకులు పూర్వాపరీభావమును భావింపవల యును. "జపాత్ సిద్ధిః జపాత్సిద్ధిః జపాత్సిద్ధిః నసంశయః" జపమువలన సిద్ధి కల్గుననుట నిస్సంశయము.

మంత్రోపాసనా విధానమంతయు భక్తియోగముల ధారణతో కూడుకొని యున్నది. ఒక్కొక్క సాధకునకు ఒక్కొక్క మంత్ర మభీష్టమగును. ఆతని జాతక విధానము ననుసరించి గ్రహకూటముల పరిస్థితులనుబట్టి జపమంత్రమును స్వీకరింపవలయుట సాంప్రదాయము. ఒక్కొక్క సాధకునకు జన్మనక్షత్రాదుల ననుసరించి కొన్నికొన్ని మంత్రములు అను కూలములగును. గ్రహకూటములయొక్క ఉచ్చ నీచ భావ ములను తెలిసికొని మంత్రస్వీకారమున ప్రయత్నింపవలయును. అట్టి నియమమును పరిపాలింపక మంత్రస్వీకార మొనర్చినచో ఆమంత్రము విపరీత ఫలప్రదమగును. యథావిధిగా సంప్ర దాయము ననుసరించి మంత్రదీక్షను పొందవలయును. జన్మాం తరసంస్కారఫలముగా ఒక్కొక్కనికి ఒక్కొక్క మంత్రము నందు ఆదరవిశేషము కల్గును. ఆయామంత్ర దేవతలందు అభిమానవిశేష ముదయించును. అట్లే మంత్రదీక్షకూడ ఒక్కొక్కని స్వప్నమునం దుపలబ్ధము కావచ్చును. మంత్ర

మును పరిపూత మొనర్చుకొని తన చిత్తవృత్తి కనుకూలమగు
నట్టి జపవిధానమును స్వీకరించి జపించు సాధకునకు అంతరా
యములు కలుగవు. సక్రమముగా మంత్రదీక్షను స్వీకరించిన
సాధకుడు తనజన్మమధ్యమం దెన్నడును మంత్రత్యాగ మొన
రింపరాదు. ఆశౌచము సంప్రాప్తమైనను అల్పసంఖ్యగానైనను
అవశ్యముగా జపింపవలయుట విధి. నిత్యానుష్ఠానమందు
నిరతుడై ప్రవర్తించునట్టి మానవునకు ఎట్టిప్రమాదపాటును
లేదు. కాని అంతటితో పరితృప్తి పొందరాదు. ఒక్కొక్క
మంత్రము సిద్ధిప్రదమగుటలో కొంత జపసంఖ్య నియమింప
బడియున్నది. దీక్షాసహితుడై నియమయుక్తముగా ఆయా
మంత్రముల జపసంఖ్యను సమగ్రముచేయుటకై పురశ్చరణ
ఒనర్పవలయును. పురశ్చర్యావిధానము ముఖ్యముగా
తలచబడుచున్నది. పురశ్చరణవిధానమందు మంత్రసిద్ధిని
పొంది నిత్యానుష్ఠానమందు అత్యంతాసక్తుడు కావలెను.
అట్టిసాధకుడే జాపకునిఫలములను పొందగలడు జపము
చేయునపుడు ఇతరులకుమాత్రము విన్పడునట్లుగా జపించుట
సముచితముకాదు. కేవలము తనకుమాత్రమే తెలియు
నట్లు నెమ్మదిగా ఉచ్చారణ చేయుచు జపించుట మధ్యమ
పక్షము. కంఠతాల్వాదుల సంబంధ మేమాత్రమును లేక
తన హృదయఫలకమందే మంత్రాక్షరముల నన్నిటిని భావిం
చుచు మనోనిగూఢము చేసికొనుట ఉత్తమమగు పక్షము.
అట్టి ఉత్తమత్వమును సంపాదించినపిమ్మట క్రమక్రమముగా
తనయందలి నాదమును అవగాహనము చేసికొనవలయును.

పరాపశ్యంతీ మధ్యమా వైఖరీ రూపమున ఉన్నట్టి వాక్సము దాయము భావనలో గోచరింపవలయును. తనలో మంత్రా క్షర బీజములు ఎచటనుండి వెలువడుచున్నవో యే యే విధ మున ఆధ్వని శరీరమందు ప్రసారము పొందుచున్నదో ఎట్లు స్ఫుటభావము పొందుచున్నదో ఈ అంశవిశేషముల నన్నిటిని సాధకుడు తెలియవలసియున్నది. క్రమక్రమముగా ఇట్టి నాదాభ్యాసమున అభ్యాసమును పొందినవాడైనచో తన యందలి అంతర్నాదములను సాధకుడు గ్రహింపగలడు. అట్లు తనచే గ్రహింపబడిన ఆనాదము ప్రణవనాదైక్యమును పొంది శబ్దబ్రహ్మను అవగాహింపచేయును. శబ్దబ్రహ్మ నిష్ణాతు డైనవాడు పరబ్రహ్మను పొందునని ప్రామాణికులు చెప్పు చున్నారు. తనలోనుండి వెలువడిన మంత్రనాదము మన స్సంకల్పమందు అనుగతమై మహావిశ్వమునందు వాతావరణ మును యోగ్యము చేయగలదు. అట్లు విశ్వగోళమునందలి పరిస్థితి మంత్రపూతమైనచో మంత్రమయీదేవతయొక్క సాక్షాత్కారమును సాధకుడు పొందగలడు. జపాభ్యాసము నందు మానవుడాసక్తుడైయున్నప్పుడు ఆతనియందలి శక్తి ప్రసారము పొందుచుండును. ఆజ్ఞాచక్రమువరకు శక్తి ప్రస రించినపుడు సాధకునకు ఉన్మనీభావము కల్గుచున్నది. ఆ అవస్థలో తన మనోరూపమంతయు మంత్రనాదమునందు ఐక్యము పొందును. ఆసమయమున ఏదియు వివిక్తముగా గోచరింపదు. ఆయనంతరము నాదప్రసారము తనయంతట నదియే బ్రహ్మపథమును పొందుటకు ప్రవర్తించును. శ్రద్ధా

సాధక

పూర్వకముగ జపించినను వేరొకవిధమున జపించినను మంత్ర నాదమువలన కలుగవలసిన ఉత్తమప్రయోజనము కల్గును. కాని శ్రద్ధాయుతమగునట్టి అర్థవిజ్ఞానపూర్వకమగు విధానమునందు మహత్వమున్నదని విజ్ఞులు పలుకుచున్నారు. జపశక్తియంతయు ధ్యానమునకు సమర్థమగునది కావలయును. కావుననే జపముకన్న ధ్యానముత్తమమని గీతావచనము చెప్పుచున్నది.

# అర్చావిధి

శ్రీదేవీపూజాపద్ధతి సకల పూజాపద్ధతులందును విశిష్టమైనది. శ్రీవిద్యాసంప్రదాయమునందలి పూజావిధానమువలె రమణీయమగునట్టి పూజాపద్ధతి ఇతరములందు కన్పడదు. ప్రథమమున సచ్చిదానందాత్మకమగు బ్రాహ్మీశక్తి నాదరూపమై మంత్రస్వభావము పొందినది. ఆమంత్రమయీ దేవత సృష్టిక్రమమున యంత్రరూపిణి యగుచున్నది. కావున సాధకుడు యంత్రమునందు పూజచేయుట సముచితము. పారమేశ్వరశక్తి కొన్నికొన్ని స్వరూపవిశేషములందు సిద్ధస్వభావముతో నుండును. అట్టి స్వరూపవిశేషములను స్వీకరించియు పూజలను ఆచరించుట సంప్రదాయముగా నున్నది. నర్మదాది నదులం దుత్పన్నమైన బాణలింగములందును, కేవల రమణీయమగు భూప్రదేశమందును, అగ్నియందును, ఉదకమందును, సూర్యునందును, గోడపైనను, పట్టువస్త్రాదులం

దును, శ్రీమండలమందును, ఫలకమునను, శిరః ప్రదేశము నను, హృదయమునందును, ఇట్టి స్థానవిశేషములందు, దేవీ భావనచేసి పూజల నాచరించుట సంప్రదాయధర్మము. సామాన్యముగా యంత్రమునందు దేవీధ్యానము విధింపబడు చున్నది. "యంత్రణాత్ యంత్రమిత్యాహుః" కామక్రోధాది దోషముల వలన సముత్పన్నములైన దోషముల నన్నిటిని యంత్రణము చేయునది యగుటవలన యంత్రమనుపేరు సార్థకమగుచున్నది. మంత్రదేవతానుసారమున యంత్రము భిన్నముగా నుండును. ప్రతియంత్రమునందును సృష్టియొక్క ప్రణాలిక కన్పడును. బిందుకోణవృత్తములు దళములు అన్నియు యంత్రములందు కూడుకొనియుండును. సర్వాధారమైన పరమాత్మ మహాబిందువు. మహాబిందువునుండి సృష్టియంతయు వెలువడు చున్నది. మహాబిందువునందు అంతర్లీనమై విమర్శస్వభావమున దేవీతత్వమున్నది. ఆతత్వముయొక్క స్ఫుటావస్థయే చక్రమునందు కోణాకృతులతో కన్పడును. పరస్పర సమ్మేళనాత్మకమైన వృత్తము మిశ్రబిందువు. ఇట్లు ప్రతియంత్రమునందును శివశక్తులయొక్క సమావేశమును అభ్యూహింప వలయును. విశ్వవిశ్వమునంతను పరమేశ్వరిగా భావించి ఆ మహా పరమేశ్వరిని శ్రీయంత్రముగా భావించి పూజించుట సర్వోత్తమభావము. విన్యాసపద్ధతిలో యంత్రమును అనేక విధముల విన్యసింతురు. నియతములైన కొలతలనుబట్టి ఆయా రేఖల నన్నిటిని విలేఖించి ప్రదర్శించునట్టి భూప్రస్తార మొక విధానము. యంత్రమునకు సంబంధించిన పొడుగు వెడల్పుల

వలె నియతమైన ఎత్తు కల్గునట్లుగాకూడ యంత్రనిర్మాణము చేయుట మేరుప్రస్తారమందురు. కైలాస ప్రస్తారమనునది వేరొకటికలదు. శ్రీయంత్రముయొక్క విన్యాసపద్ధతి ముందు స్పష్టముచేయబడును.

ఆయా నియతమైన ప్రదేశములందు యథావిధిగా గురుప్రతిష్ఠితమైన యంత్రమునుంచి పూజించుట ఉత్తమ సంప్రదాయము. తాను పూజించునట్టి యంత్రము గురుప్రదత్తము కావలయును. ఏది యేనివిధమున యంత్ర ముపలబ్ధమైనను దానిని గురుస్పర్శచేత పవిత్రము చేయవలయును. పూజాసంప్రదాయములందు అనేకాచారము లుండును. వామాచారుడు పూజించిన యంత్రమును దక్షిణాచారుడు స్వీకరింపరాదు అని మంత్రవిదులు పల్కుచున్నారు. ఇందలి శేషరహస్యములను గురుసంప్రదాయ క్రమమున తెలియవలయును. సాధకులకు సౌలభ్య సంపాదనమునకై పూజ ఏర్పాటు చేయబడినది. పూజావిధానమువలన మనస్సునకు నిశ్చలత ఏర్పడును. స్థిరనిష్ఠ కల్గును. లోకసంగ్రహము కూడ సంపాదింపబడును. కేవలము ఆయా మూర్తియందే పరమేశ్వరసత్త ఉన్నదని ఎవరును అనరు. తద్రూపయంత్రములు ఆధారముగా విశ్వసదాత్మను గ్రహింపవలయునని తాంత్రికుల నిర్ణయప్రణాలిక. పూజావిధానమందు ఏదియేని స్థిరలక్ష్య ముండవలయును. పూజావిశేషము చక్షుః ప్రత్యక్షమగు బాహిరరూపమును కాంక్షించునది యగును. ఏదియేని రూపము నవలంబము చేసికొని యంత్రముయా

భావన చేయుచు దేవీనిష్ఠను పొందుటయే పరమావధిగా చెప్పబడుచున్నది. ముఖ్యముగా పూజయందు రెండు విధము లున్నవి. ఒకటి బాహ్యపూజ. వేరొకటి ఆభ్యంతరపూజ. బాహ్యపూజయందే సామగ్రియొక్క అపేక్షయున్నది. ఆం తర పూజయందీ అపేక్షలేదు. పామరులగువారు బాహ్య పూజలందు అధికాదరమును ప్రదర్శింతురు. అంతకన్నను ఉత్తమాధికారులు మానసపూజయం దభిలాషపడుదురు. మరికొందరు నిరంతర భావనా నిమగ్నులై పూజావిశేషమునే మరచిపోదురు. అంతకన్నను ఉత్తములగువారు అహంభావ నతో పరితృప్తిని పొందుదురు. మొత్తముమీద ప్రజా సముదాయమునకు అభిమానవిశేష ముదయింప చేయుటకై బాహ్యపూజనుకూడ ఎంతటి ఉత్తమునకైనను ఆచరణీయ ముగా తలచినారు. బాహ్యపూజ నాచరించునట్టి అత్యుత్త మాధికారి తన యర్హతా సమర్థతా విశేషముల ననుసరించ వలయునే కాని పూజావిశేషమును లోటుపరచరాదు. అట్టిది లోకసంగ్రహము కాజాలదు. బాహ్యపూజా పర తంత్రులగు వారలకు కాలదేశాది నియమము లనేకము లున్నవి. పరమేశ్వర పూజకు ఒకదేశమని ఒకకాలమని నియమమక్కరలేదు. శుచిగా నుండి ఏదేశముననైన ఏ కాలముననైన పూజలను నిర్వహింపవచ్చును. కాని లోక ప్రరోచనాసముత్పాదనమునకు కొన్ని సవిశేష నియమములు బోధింపబడినవి. శ్రీదేవీప్రాదుర్భావాది విశేషములును అచట సంగతములు చేయబడినవి.

శ్రీ

శరన్నవరాత్రములందును వసంతనవరాత్రములందును శ్రీదేవీపూజామహోత్సవములు సవిశేషముగా ఆచరింపబడును. ఈరెండుసమయములకును యమదంష్ట్రికలని పేరు. ఇయ్యవి అనేకారిష్టములను సంపాదించును. అట్టి అరిష్టములను కలుగకుండ చేసికొనుటకై దేవీపూజల నాచరింపవలయును. ఈ పూజావిధానముల నవరాత్రములం దాచరించుట సంప్రదాయసిద్ధమైయున్నది. ఇట్లే మాసమాసమందును అష్టమి, చతుర్దశి, అమా పూర్ణిములయందును, శుక్రవారములందును, దేవీపూజలకు ప్రాధాన్యము తలచుచున్నారు. త్రిపురసుందరీదేవి చిదగ్నికుండమునుండి రాత్రిసమయమున ప్రాదుర్భావము పొందినది. కావున సాయంసమయములందు పూజను సవిశేషముగా నిర్దేశించుచున్నారు. ఇంకను చంద్రసూర్యోపరాగసమయములందును విశిష్టకాలములందును పూజల నాచరింతురు. పరమేశ్వరీపూజకు రాత్రి తొమ్మిది గంటలనుండి తెల్లవార నాల్గుగంటలవరకు ఉత్తమమగు కాలమని పూజాధురంధరులు పల్కుచున్నారు. వరివస్యారహస్యార్థమును భావింపగల్గిన మహనీయులు ఏసమయమైనను పూజకు సముచితమే అని చెప్పుదురు.

పూజలందు సామాన్యముగా భేదమును పరిగణించుట అవసరముకాదు. అర్హతావిశేషములను అనుసరించిన పద్ధతులు భిన్నములుగా నుండవచ్చును. ఆదృష్టితో వేరువేరుగా నిర్దేశించుటయు అసముచితముకాదు. దేవీపూజలో సంఖ్య అపేక్షితముకాదు. అయినను సాధకసౌలభ్యమునకు అదియు



మాధవ

అపేక్షితమగుచున్నది. ఎన్నివిధముల పూజ నాచరించినప్పటికి అన్నివిధానములనుకలసి ఒకటియే మహావిధానమగుచున్నది. అదియేమహాపూజ. సౌలభ్యసంపాదనమునకు అవాంతరభేదములనుకూడ పరిగణనచేయుట ఆవశ్యకమని తలచినారు. భేద ప్రభేదములతో కూడుకొనినపూజను ఆచరించుటకు ఏఒకఁడో సమర్థుడగును. అట్టియాతడే పూజలను చేయుట సముచితము. ఆరాధనయందసమర్థుడగునేని అర్చనసాధనములనైనను సంపాదించి పూజచేయువాని కిచ్చుట సముచితమని చెప్పుచున్నారు. అర్చనసాధనముల నిచ్చుటకును సమర్థులు కాకపోయినచో అర్చాదర్శనమైనను ఒనరింపవలయునని సాంప్రదాయకుల నిర్దేశము. ఇతరదేవతలకు చేయబడునట్టి ఆరాధన పూజయనబడుచున్నది. శ్రీదేవీ విషయమున ఇదియే ప్రధానముగా అర్చనయని, వరివస్యయని, చెప్పబడును. ఇట్టి ఈదేవీపూజావిశేషమందలి, ప్రవిభేదములు ఐదువిధములని, పదునారువిధములని, అరువదినాల్గువిధములని, చెప్పుచున్నారు. తాంత్రికములైన ఆయా విశేషములందు కూడుకొనిన అద్భుత విశేషములను నిరూపించుటకు ఈ చిన్నిఅవకాశము అపర్యాప్తము. ఏ పూజావిశేషమందైనను పంచభూతములకు సంబంధించిన పూజాద్రవ్యములు కన్పడును. వీనినన్నిటిని భావించగా ఈ భావము సుబోధము కాగలదు.

శ్రీశక్తిస్వభావమునుండి పంచభూతములు వెలువడినవి. సాధకుడును పాంచభౌతికవిలాసముతో కూడుకొనియున్నాడు.

ఆయాభూతముల సవిశేషసంబంధమువలన మానవునియందు అహంకారాత్మకమగు ప్రవృత్తి జనించుచున్నది. ఈ సర్వాహంకారములను శ్రీదేవీసన్నిధానమున ప్రవిలాపము' చేసికొనవలయును. ఆప్రవిలాపన విధానమే ఈ పంచపూజలో కన్పడుచున్నది. "నాయందలి భౌతికాంశములను, తజ్జన్యములైన సర్వాహంకార ప్రకృతులను, ఓదేవీ! నీయందు ప్రవిలాపము చేయుచున్నాను" అని పూజారహస్యము. ఈ అభిప్రాయము మూలముగా అంగోపాంగములు ఇతరపూజలలో కూర్పబడుచున్నవి. వానియందు కూడ ఇదియే అర్థము భావింపవలయును. సామాన్యముగా సాధకుడు నిష్ఠాయుక్తుడై ఆరాధన చేయునప్పుడు విశ్వమునంతను మరచిపోవలయును. తనయందలి స్త్రీత్వమునుగాని పురుషత్వమునుగాని మానవత్వమునుగాని, స్మృతిలో నుంచుకొనరాదు. అంతియేకాదు. శ్రీదేవికన్న అతిరిక్తముగా తనకు సత్తకూడ భావింపరాదు. కేవల చిన్మాత్ర ప్రతిభతో ఆదేవీయాగమునంతను నిర్వహింపవలయును.

## వామాచారము

పూజాద్రవ్యములను స్వీకరించుటలో ఒక్కొక్కసాధకుడు ఒక్కొక్క అభిరుచిని కల్గియుండును. సామాన్యముగా ఆచారభేదము ననుసరించి సామగ్రీభేదము కల్గుచున్నది. తంత్రగ్రంథములందును వైదికములు కొన్ని వామములు కొన్ని కలవు. వాసిష్ఠసంహితాదులు వైదికములు. మత్స్యసూక్తా

దులు వామములు. వామతంత్రానుసారమున వామాచారము ప్రచారమునకువచ్చినది. వామాచారము శీఘ్రఫల ప్రదమనియు కొందరు భావించు అవివేకులున్నారు. అర్థవాదాత్మకమైన వచనములను భిన్నార్థములనుగా గ్రహించుటనుబట్టి అనేకులకు విపరీతమతు లుదయించినవి. విరుద్ధబుద్ధిహేతువైన మానవులు స్వార్థాహంకారతత్వముల కూడుకొని లోకమునకు విపరీతప్రత్యయమును కలుగజేసినారు. వామాచారవిధానమును సూచించునట్టి వచనములు తంత్రగ్రంథములందు లేకపోలేదు. కేవలము: తత్తదాచారములందు అభినివేశముకల్గి ఇతర విశేషములను మరచిపోయిన పామరులనుకూడ పరమేశ్వరీపూజాతత్పరులను చేయుటకై ఆశాప్రత్యాశలను కలుగచేసి తంత్రగ్రంథములు లోకోపకారమునుసంపాదించుచున్నవి. అంతియేకాని వానియందే పరమాభిలాష కలవారై ఇతరములనన్నిటిని ఉజ్జగింపవలయునని గ్రంథములు బోధించుటలేదు. అట్టి ఆ వచనములను యథాశ్రుతముగా గ్రహించి అపార్థము చేయుచు లోకమును వ్యాకులపెట్టుట ఉచితకృత్యముకాదు. లలితాసహస్రనామములందు, కాదంబరీప్రియా, కౌళమార్గ తత్పరసేవితా, మాధ్వీపానాలసా, భగారాధ్యా, మధుమతీ, యోనినిలయా, సవ్యాపసవ్యమార్గస్థా, దక్షిణాదక్షిణారాధ్యా పంచమీ, బిందుదర్పణసంతుష్టా, యోనిముద్రా అనునట్టి నామము లున్నవి. వీని ఆపాతార్థమును చూచినచో వామాచారము దేవీపూజలో ప్రతికూలముకాదని తెలియును. కాని అట్టి మద్యమాంసాది వ్యవహారమే సముచితముకాదు. కావున

శ్రీ

విజ్ఞులైన కొందరు ఆయాపదములకు అర్థాంతరమును కూడ అనుసంహితము చేయుచున్నారు. సామాన్యముగా మద్యము, మాంసము, మలము, మూత్రము, మైథునము అను ఈఐదును పూజాంగములని వామాచారులు తలంతురు. మలమూత్రములు మరియు ఏహ్యముగానున్నవని కొందరాస్థానమున మత్స్యమాషముల నేర్పరచినారు. "వినాలిపిశితాభ్యాంతు పూజనం నిష్ఫలం భవేత్" మద్యమాంసములు లేనిపూజనము నిష్ఫలము. "మద్యంతు భైరవోదేవః మద్యంశక్తి: సమీరితా" ఆదిభైరవీ భైరవులు మద్యస్వరూపులు "సురాశక్తిః శివామాంసం తద్భోక్తా భైరవః స్వయం। తయోః ఐక్యసముత్పన్నః ఆనందో మోక్షఉచ్యతే" మద్యము శక్తి. మాంసము శివుడు. వాని ననుభవించువాడు భైరవుడు. ఆరెండింటివలన కల్గునట్టి ఆనందమే మోక్షము. అని ఈ అర్థమును ఉపబృహింప చేయునట్టి అనేకవచనములున్నవి. పైన చెప్పబడిన ద్రవ్యములు మకారపంచకమని వారు వ్యవహరింతురు. ఐదవ విధానము సభ్యతకలవా రంగీకరింపతగిన విషయముకాదు. "బ్రహ్మస్యాత్ పలలే విష్ణుః గంధే రుద్రశ్చ తద్రసే పరమాత్మా తదానందే" మాంసమున బ్రహ్మకలడు. దానిగంధమున విష్ణువుకలడు. తద్రసమున రుద్రుడున్నాడు. ఆ ఆనందమున పరమాత్మకలడు. కావున మాంసమును సేవింపవలయును అని చెప్పునట్టి కొన్ని వచనములు కలవు. ఇట్టి వచనములకు యథాశ్రుతార్థమును గ్రహించుట ప్రామాదికము. పామర జనులను ఉపాసనాపరులను చేయుటకై వారికి ప్రరోచన

కల్గచేయుటకై అట్టిఉపాయములు సాధనములు స్వీకరింపబడి నవి. ప్రథమమున అట్టి ప్రరోచనమును సంపాదనచేసి వాని కాధ్యాత్మికార్థమును బోధించి స్వరూప సంవేదనమున కగు ఉపాసనావిధిని వారలచే అనుసరింప చేయుటయే వామాచారముఖ్యాభిప్రాయము. అంతియేకాని వానినే అనుసరింప రాదు.

మానవునకు వైదిక విధానమే శ్రేయస్కరము. వైదిక తంత్రములందు బోధింపబడిన ఆచారములే స్వీకార్యములు. వామోక్తవిధానములు వివేక విజ్ఞానముకల సాధకునకు అంగీకార్యములుకావు. వంగదేశమునందు శక్తిపూజాసంప్రదాయము విపుల ప్రచారములో నున్నది. అచటివారు సామాన్యముగా మత్స్యభోజులు. దేవీపూజలలో వారు మద్యమాంసముల నుపయోగింతురు. వారిసంప్రదాయమే దేశదేశముల వ్యాపించినది. కొందరు వైదికమ్మన్యులు తామును ఆ ఆచార విశేషములనే పాలించుచున్నారు. దినం దిన పూజలో అందరకును మద్యమాంసములు దొరకక పోవచ్చును. నిత్య పూజకై అవి అపేక్షితములని భావించువారు తామ్రపాత్ర యందు క్షీరములనుంచి మద్యముగా భావింతురు. రాగిస్పర్శ యున్నచో క్షీరములు మద్యప్రాయము లగునని ప్రామాణికుల విశ్వాసము. అట్లే కొబ్బరినీటికిని రాగిస్పర్శయున్నచో మద్య ప్రాయత లోకప్రసిద్ధము. ఈవిశేషములను సంపాదించి పరమేశ్వరికి మద్యనివేదన మొనరించినట్లుగా తృప్తిపడుచున్నారు.

శ్రీ

సారాయముయొక్క సారాంశమును సీసాలలో దాచియుంచు కొని రోజున కొక్క బిందువును నివేద్యాంశమందు కలిపి మద్యభావన చేయుచున్నారు. జ్ఞానార్ణవతంత్రమునందు చెప్పబడిన ప్రకారమున ఆయాపదార్థములను సంపాదన చేసి వానిని పాకమొనర్చి ఆవిశిష్టద్రవ్యమును చిన్న మాత్ర లుగాచేసి ప్రతిదినమునందును విశేషార్ఘ్యమునందుంచి మద్య రూపమున భావనచేయుదురు. ఆద్రవ్యము మద్యశక్తుల యొక్క సమ్మేళనాంశమున సముత్పన్నమగుచున్నట్లు సుస్ప ష్టము. నిత్యమును మత్స్యమాంశాశనులై ప్రవర్తించు పామర జనులకు ప్రరోచనను కల్గచేయుటకై బయలుదేరిన ఈసంప్ర దాయము ప్రాజ్ఞులలో ప్రసారము పొందుటవలననే లోకమున శక్తిపూజావిశేషములు కొందఱిదృష్టిలో అవైదికములగు పాషం డాచారములుగా పరిగణింపబడుచున్నవి. అట్లు రహస్య రూపమున మద్యమాంసభావనచేయుచు ప్రవర్తించువారు లోకవంచకులని తెలియవలయును. ప్రాజ్ఞులు లోకమునందు అనుచితము. అట్టివారుకూడ ఈ విశేషమునే అనుసరించుచు రహస్యముగా మద్యమాంసములను సేవించుచు, "శక్తిపూజా విశేష మత్యంతము రహస్యమని, ఇతరులేమాత్రమును తెలి యుట కర్హులు కారని, అత్యంతమదిగోపనీయాంశమని" ప్రచారము చేయుచున్నారు. మాంత్రికపూజా విశేషమును అత్యంతము బహిరంగము చేయవలసినదని మేమును అనము. కాని అది అంతగా దాచనక్కరలేదని సత్యమును ధైర్యముగా చెప్పుదుము.

శ్రీ

శక్తిని పూజించుట కష్టమనియు, పూజావిశేషములందు శక్తిసాధకుని అణచివేయుననియు కొందరు జంకుదురు. శక్తి పూజకులకు హాని కల్గునని కొందరు లోకమునకు భయమును కలుగచేయుచున్నారు. జగన్మాతయగు శ్రీదేవీపూజావిశేషము యేమాత్రమును హానికరముకాదు. ఆవిషయమై ఎవరును ఏవిధమగు భయమును పడకూడదు. ఈ వ్యర్థభయములన్నియు నిష్కారణముగా లోకమున వ్యాపించినవి. అనుచితాచారములను స్వీకరించి, శౌచాది విధానములులేక, సంప్రదాయవిహీనులై, ఆభిచారికములను తలపెట్టుచు, ప్రవర్తించునట్టి అన్యాయగాములకు ఏవిధానములందైనను హాని యున్నది. మకారపంచకమునందు ఐదవదియగు మైథున విధానము పూజావిశేషములందు సంక్రమింపచేసి వామాచారులు అనేకానాచారములను అతిచారములను చేయుచున్నారు. పూజాసమయమున ప్రాప్తమైన సామయికుల కందరకును మద్యపానమున ప్రౌఢోల్లాసమును కలుగచేయుదురు. అప్పటి ఆయావేశములో నొడలు తెలియక వస్త్రరహితముగా అందరును నర్తనము చేయుదురు. యథేచ్ఛావిధానమున స్త్రీపురుషులు ఉపభోగము ననుభవింతురు. అచట సంప్రాప్తమైన యువతులు పరమేశ్వరీబుద్ధితో చూడతగినవారు. అట్లు భావించుచును అచటి స్త్రీలను భైరవీరూపమున తలచి పురుషులు తమరిని భైరవీరూపముగా భావనచేయుచు ఆనందభైరవ ఆనందభైరవీ సముల్లాసమున అనుభవింపచూతురు. భైరవీ రూపిణియగు యువతికి సకలపరితృప్తులయందును ఉత్తమపరి

తృప్తిని కలుగచేయుటకై మిథునకర్మయందు ప్రవర్తించు చున్నారు. ముత్తైదువలనుగా పిలచి మిథునకర్మల ప్రసక్తి యందు వారలనుకూడ చేర్చుచున్నారు. ప్రాణిసామాన్యమం దును కృత్యసామాన్యమందును పరమేశ్వరీభావన యుండుట ఎవరును కాదనరు. కాని లోకసంగ్రహమొనర్పజాలని విధా నములను పూజావిశేషములుగా భావించి లోకమునకు విరుద్ధ బుద్ధిని కల్గుచేయుట అసముచితమని భావింపవలయును. వామాచారమను భావముతో అనేక విరుద్ధాతిచారములను చేయుచున్నారు. అవియేవియు ప్రాజ్ఞుల విషయమై క్షంతవ్య ములుకావు' కొన్నికొన్నియెడల స్త్రీ యోనిమండలమును పూజించుటయు సంప్రదాయముగా నున్నదని కొందరందురు. "యోనిమండలరూపిణి భగారాధ్య"అను పదమున కీయర్థమునే చెప్పుచున్నారు. 'బిందుదర్పణ సంతుష్ట' అను పరమేశ్వరీ నామములకు స్త్రీపురుష సమావేశ సంపాదిత మిశ్రబిందు తర్పణసంతుష్ట అనియు నర్థము చెప్పుదురు. ఈ అనౌచిత్య మును ఇచట విమర్శించుటయు సముచితము కాదు. పాఠ కులే భావింపవలయును. వామమార్గమున ఇట్లే భావించుట ఉచితముకాదు. వామానుసరణమున విష్ణులోకప్రాప్తి కల్గు నని ప్రామాణికవచనము లున్నవి. వామపదమునకు ప్రశస్య మని అర్థము. "వామోమార్గః పరమగహనః యోగినామప్య గమ్యః" వామమార్గము అతికఠినము. యోగులకును అది అగమ్యము. ఇంద్రియలోలత్వము కల్గిన మూఢజనులకు ఇది గమ్యము కానేరదు. "లోలుపోనరకంవ్రజేత్" అని శివ

వచనము. జితేంద్రియులైన యోగులే వామమార్గమున ప్రవర్తింపవలయును.

"పరద్రవ్యేషుయోఽంధశ్చ పరస్త్రీషు నపుంసకః। పరాపవాదే యోమూకః సర్వదా విజితేంద్రియః తస్యైవ బ్రాహ్మణస్యాత్ర వామేస్యా దధికారితా" అని మేరుతంత్రము చెప్పుచున్నది. బ్రహ్మరంధ్ర సహస్రదళమునుండి సుధా ద్రవము స్రవించును. కులకుండలినీ ద్వారమున యోగి జనులు ఆ సుధారసము నాస్వాదింపగలరు. ఇదియే మద్య పానము. పుణ్యాపుణ్య పశువును జ్ఞానఖడ్గమున వధించి తనచిత్తమును పరతత్వమందు లయింపచేయువాడు మాంసా హారి.

యానాడీ సూక్ష్మరూపా పరమపదగతా సేవనీయా సుషుమ్నా సాకాంతాలింగ నార్హా న మనుజరమణీ సుందరీ వారయోషిత్। కుర్యాత్ చంద్రార్క-యోగే యుగ పవనగతే, మైధునంనైవ యానం। యోగీంద్రో విశ్వకందే సుఖమయ భవనే తాం పరిష్వజ్యనిత్యం.

పరమానందమును పొందింపచేయునట్టి సుషుమ్నా నాడి బ్రహ్మదండమునందు కలదు. అదియే సేవనీయమగు కాంత. మనుజరమణిగాని వేశ్యకాని అచట ఉద్దిష్టముకాదు. సుషుమ్నను సహస్రారములోని బ్రహ్మతో కూడుకొన చేయు టయే మైధునము. ఇతరముకాదు. ఈవిధమున తంత్ర గ్రం థములందు ఆయాపదములకు ఆయా అర్థములను చెప్పు

చున్నారు. ఇట్టి ఈ వామాచారము ఆధ్యాత్మికముగా సమ న్వయపరచినప్పుడు ఉత్తమమార్గమునే బోధించునుగాని దాని సామాన్యార్థములో లోకము వ్యామోహపాటును పొంది భ్రష్టమగుచున్నది. సాత్విక రాజస తామస భేదమున, వామ మార్గము త్రివిధము. కౌలికము వామము చీనము సిద్ధాం తము శాబరము అని వామము ఐదువిధములు. కౌలాదు లందును అవాంతర భేదములున్నవి. వాని భేదప్రభేదములందు ఆధ్యాత్మికముగా కూడుకొనిన సమన్వయము మనోహరమై యుండును. ఇష్టపూజలో షోడశోపచారములందు బలిదా నముకూడ ప్రధానోపచారముగా నున్నది. ఇదిలేక పూజకు సమగ్రత్వము లేదు. ఇష్టదైవమునకు ఆత్మార్పణము చేయు టయే బలిదానమని ప్రదానముగా చెప్పతగియున్నది. జీవా త్మను పరమాత్మభావమందు హోమముచేయుటయే తదర్థము. సాత్వికప్రకృతికులైన మానవులకు పశ్వాదుల బలివిధాన ముచితముకాదు. సాత్వికుడగు వాడు ఎన్నడును జీవహత్య చేయరాదు. ఇక్షుదండము, కూష్మాండము, వన్యఫలములు, క్షీరపిండములు, శాలిచూర్ణములు, ఆతని బలివిధానముగా ఉండతగినవి. కొన్నికొన్ని దేశసంప్రదాయములలో సుగుణ వతియైన కన్యకను, పతివ్రతను, బ్రహ్మనిష్ఠుడైన సన్యాసిని, పండితుడైన బ్రాహ్మణుని, ఆటపాటల అందకత్తెయైన వేశ్యను, క్షీరకంఠుడగు బాలుని బలిగానిచ్చుట ప్రచారమందున్నది.

పూజాసంప్రదాయములలో ఉపయోగింప వలసిన ద్రవ్యభేదమునుబట్టి ఆచార భేదమును కొంద రూహింతురు.

క్షీరముల ఉపయోగింపవలయునని సామాన్యవచనము. సాత్త్వికమగు నిష్ఠతో సత్యాంశమును అభివృద్ధిచేయునట్టి హింసాకరముల ఉద్వేగకరములుకాని విధానములనే అవలంభించుట సముచితమని తంత్రజ్ఞుల యభిప్రాయము. వామాచారులును కౌళమార్గులును క్షీరముల ఉపయోగించినను మద్యముగా తలచి పూజను నిర్వర్తింతురు. సురాద్రవ్యమును శుక్రాచార్యు డొకప్పుడు శపించినాడు. ఆశాపోద్ధారవిధానమునకు వామ కౌళమార్గులు మంత్రమును జపింతురు. శుక్రశాపోద్ధార మంత్రమొకటి నియమితమై యున్నది.

## దక్షిణాచారము

ఉత్తమద్రవ్యములను దేవీపూజాంగములనుగా గ్రహించుట ప్రామాణిక సమ్మతము వైదికమును అగుచున్నది. ఇదియే సమయాచారమని దక్షిణాచారమని చెప్పబడును. ఈఆచారవిశేషమే లోకమునకు ఆదర్శప్రాయము. అదియే మానవులకు అనుసరింపతగిన ఉత్తమవిధానము. బాహ్యపూజావిశేషమందు సామగ్రీకలాపముయొక్క ఆవశ్యకత యున్నది. అభిషేకద్రవ్యములందును నానావిధరసద్రవ్యములు సమానీతములగును. నివేద్యాంశములలో అనేక విధములగు విశేషము లున్నవి. పూజాసమయమునందు పరమేశ్వరీబుద్ధితో ఆసంప్రదాయమంత్రదీక్షను పొందిన ఉత్తమ యువతిని కూర్చుండబెట్టి పరమేశ్వరీ బుద్ధితో యథాక్రమముగా పూజలొనర్చుట సంప్రదాయ ధర్మము. సామా

న్యార్ఘ్య విశేషార్ఘ్యముల పద్ధతులలోని సుందరత కడుంగడు మనోహరము. పూజాసంప్రదాయము దక్షిణాచార పూజా ఖండలలో అత్యద్భుతముగా రాణించుచున్నది. పూజాఖండకు సంబంధించిన సవిశేషవిధానము అస్మద్గురుపాదులు శ్రీ కల్యాణానంద భారతీస్వామి పాదుల సన్నిధానమున సుప్రకాశమైయున్నది. యంత్రారాధన చేయునపుడు తంత్రోక్తములైన విధానముల నన్నిటిని సంప్రదాయక్రమమున అనుసరింపవలయును. పూజచేయుటలో ప్రధానముగా ఈ భావమును గ్రహింపవలయును. పూజచేయునట్టి సాధకునియందును పరమేశ్వరశక్తి యున్నది. ఆ శక్తినే సంప్రదాయ ముద్రాక్రమమున బహిర్గతము చేసికొని సాధకుడు పూజించుచున్నాడు. తనయందలి చిచ్ఛక్తిని తానారాధన చేయుచున్నాడు. బాహ్యపూజకు సామగ్రీవిశేషమును సంపాదించి పూజను నిర్వర్తించునట్లుగా మానసవీధియందే సామగ్రి నంతయు భావింపచేసికొని పూజావిధానమును నిర్వర్తించుట శుభావహమగు ధర్మము. ఇట్టి నియతమైన పూజావిధానముతో పూజ సంపూర్ణమగుటలేదు. చక్కని పూజ నాచరించిన పిమ్మట శ్రీ దేవీరూపమును హృదయప్రతిష్ఠితము చేసికొని జపించి ధ్యానింపవలయును. పూజాప్రణాళిక యంతయు ధ్యానానుకూలము కావలయునని సంప్రదాయ విశేషవిదులు స్పష్టము చేయుచున్నారు. జపధ్యానవిధులచే లీలామయరూపము కల్గినట్లుగా భావించిన పరమేశ్వరీ రూపమును హృదయమునం దనుసంధానము చేయుచు నృత్త

గీతాది విధులను ప్రదర్శించి నామపారాయణ స్తోత్రాదుల ఆచరించుట ముఖ్యవిధానమై యున్నది.

పారాయణ చేయుటలో నానావిధములగు పద్ధతు లున్నవి. మానసికముగా కూడ పారాయణ చేయవచ్చునని భాస్కరరాయలు చెప్పుచున్నాడు. అనంతరము పుష్పాంజ లిని సమర్పించి దేవీ పాదోదకమును గ్రహించుట సవిశేష ధర్మము. ఇందలి అవాంతర విధానములు సంప్రదాయ విజ్ఞేయములు. తాను ఆరాధనచేయునట్టి ఇష్టదైవమునందే సకల దేవతల స్వరూప స్వభావములను భావించి పూర్వాం గోత్తరాంగదేవతలనుగా నిర్ణయించుకొని ప్రధానదేవత నారాధించుట ఇష్టవిధానము. ఇదియే దక్షిణారాధన పద్ధతి యని ప్రామాణికులచే చెప్పబడుచున్నది. ప్రత్యక్షసిద్ధముగా బాణలింగాదులందు దేవీ చిదంశమును భావనచేయుచు ఆరా ధించుట ఇచటి సంప్రదాయ ధర్మము. అంతియేకాక ఆ విశేషవిధానములబట్టి చంద్రమండలమునందు దేవీస్వరూప భావనచేయుచు ఆరాధించుటయు ఆనుభవికుల విజ్ఞానపథ మందున్నది. ఇంకనుకల పూజాస్థాన విశేషములు సంప్ర దాయ బోధలలో గురుముఖైకగమ్యములైయున్నవి.

శ్రీవిద్యోపాసనా పద్ధతికిని యోగాభ్యాస పద్ధతికిని సవిశేషసంబంధము కలదు. చిరకాలము మహానియమము కల్గి సక్రమముగా యోగమవలంబించినపుడు కల్గునట్టి శక్తులు శ్రీవిద్యారాధనవలన అనాయాసముగా కల్గును. శబ్దస్వభా

వమును పొందిన మంత్రేశ్వరి శ్రీవిద్యారూపిణియై ప్రకాశిం చుచున్నది. అక్షరాత్మకమగు ఆతత్వమును అవగాహన చేసి గొనిన మహనీయులు పరమగమ్యమును పొందుదురు. ఆయా ఉపనిషత్తులందు చెప్పబడిన ఉపాసనలు మహాఫలమును సం పాదింప చేయజాలవు. శ్రీవిద్యోపాసన మట్టిదికాదు. ఇచట ఉపాసనయు సామాన్యోపాసనల వంటిదికాదు. పరాపర రహ స్యాత్మకమైన అఖండబ్రహ్మతత్వము ఈ ఉపాసన వలననే తెలియును. కావున దీనిచే తెలియబడునది అల్పమని తలచ రాదు. ఉపాసనాపదముచేత చెప్పతగిన మహోపాసన ఇదియే. దశమహావిద్యలలో షోడశీనామకమగు మహావిద్యయే శ్రీవిద్య. శ్రీదేవి సుందరి లలిత త్రిపురసుందరి మొదలగు పదములచే చెప్పబడునది ఇదియే.

ఈ ఉపాసనాతత్వములను చక్కగా తెలియుటకు దేవీ స్వరూపభూతమైన చక్రరహస్యమును తెలియవలయును. అధోముఖములైన శక్తి చక్రరూపములగు ఐదు త్రికోణము లును ఊర్ధ్వముఖములైన శివచక్రమయములగు నాల్గుత్రికోణ ములును గూడి ఏకస్థలమున సమ్మిళితములైనచో శ్రీ యం త్రము. ఇది అతివిస్తృతమైన మహాగహన విషయము. శ్రీ చక్రమునందు నవచక్రము లున్నవి. మొదటిది బిందుస్థానము అదియే మహాబిందువు. అది మూలకారణము. మహాకామే శ్వర మహాకామేశ్వరీ సామరస్యాత్మకము. సర్వజగన్మూల యోని. అదియే శివభావము. రెండవచక్రము త్రికోణము. ఇది ఆద్యావిమర్శ శక్తి శబ్దార్థరూపసృష్టికి కారణాత్మికమైన

పరాశక్తియని, అహంభావమని, జీవతత్వమని, చెప్పబడు చున్నది. మూడవది అష్టారము. ఇందెనిమిది కోణము లుండును. లింగశరీరమునకు కారణమైన ఇది కారణశరీర మన బడును. నాల్గవది అంతర్దశారము. ఇది ఇంద్రియవాసనాత్మకమగు లింగశరీరము. ఐదవది బహిర్దశారము. తన్మాత్రలను పంచభూతములును అగు ఇంద్రియ విషయములు దీనిచే సూచింపబడును. చతుర్దశారము ఆరవది. ఇది జాగ్రదవస్థలోని స్థూలశరీరము. ఏడవది అష్టదళము. అష్టారవాసనయే ఇందు సంక్రమించును. ఎన్మిదవది షోడశదళము. తొమ్మిదవది భూపురము. బిందు, త్రికోణ, వసుకోణ, అష్టార, చతుర్దశార, అష్టదళ, షోడశదళ భూపురముల సమిష్టిరూపమున ఇది విరాజిల్లుచున్నది.

ఈనవచక్రములకు ప్రత్యేకముగా నామసంకేతమున్నది. అధిష్ఠానదేవతలున్నారు. మొదటిచక్రమునకు సర్వానందమయమని పేరు. మహాత్రిపురసుందరి తధిష్ఠానదేవత. ఇట్లే క్రమముగా సర్వసిద్ధిప్రదము, త్రిపురాంబ; సర్వరోగహరము, త్రిపురసిద్ధ- సర్వారక్షాకరము, త్రిపురమాలిని- సర్వార్థసాధకము, త్రిపురా శ్రీ- సర్వసౌభాగ్య దాయకము, త్రిపురవాసినీ- సర్వ సంక్షోభణకారకము, త్రిపుర సుందరి- సర్వాశాపరిపూరకము, త్రిపురేశి - త్రైలోక్య మోహనము, త్రిపుర - అను వానిని ఆయా చక్రములకు నామములనుగా అధిష్ఠాన దేవతలనుగా భావింప వలయును. మతాంతరమున ప్రకట, గుప్త, గుప్తతర, పరాసంప్రదాయ,

మాధవ

శ్రీ

కుల, కౌల, నిగర్భ, అతిరహస్య, పరాపరరహస్య నామ మున పిలచుచున్నారు.

యంత్ర మనగా గృహము. శ్రీ దేవీగృహమగుట వలన శ్రీ యంత్రమని శ్రీ చక్రమని చెప్పబడుచున్నది. ఈ విశ్వమంతయు శ్రీ దేవీగృహము. ఇచట విశ్వశబ్దముచే పిండాం డమును బ్రహ్మాండమును గ్రహింపవలయును. మాయాం డము బ్రహ్మాండము ఇవియు స్థూలసూక్ష్మరూపమున వీని యందే అంతర్గతము లగుచున్నవి. "చక్రం త్రిపురసుందర్యాః బ్రహ్మాండాకారమీశ్వరి! నవచక్రమయం" ఈ పదములు పిండాండ బ్రహ్మాండములయొక్క స్వరూపతత్వము శ్రీ దేవీ చక్రమునకు కలదని చెప్పుచున్నవి. "శ్రియతే యా సాశ్రీః" అను వ్యుత్పత్తివలన ఆశ్రయించునది శ్రీ యనబడును. ప్రాచీనపరంపరాగత వ్యవహారానుసారమున సత్ పదముచే చెప్పడు ఆత్మయే శ్రీకి ఆశ్రయము. కావున ఆత్మను ఆశ్ర యించునది అగుటచే శ్రీ యనబడును. ఆ శ్రీని ఆత్మశ్రీ అనుట సముచితమే. ఆత్మకు ఆత్మశ్రీకిని భేదములేదు. అగ్నికి అగ్నియందలి ఉష్ణత్వమునకు భేదము లేనట్టు బ్రహ్మకు శక్తికిని భేదములేదు.

"నశివేన వినాదేవీ నదేవ్యాచ వినాశివః"
నానయోరంతరం కించిత్ చంద్రచంద్రికయో రివ"

ఈ మహాశక్తి ప్రళయసమయమందు ప్రకాశమయ మగు పరబ్రహ్మరూపము పొందియుండును. ఈ అవస్థలో

రాగి మాధవ

శక్తికి పృథగ్స్వరూపము లేదు. ఈ శక్తి బ్రహ్మయందు లీనమగు చున్నది.అదియే మహాబిందువని పరమాత్మయని గ్రంథములందు వర్ణింపబడుచున్నది. ప్రళయకాలమందు బ్రహ్మయందు అవి నాశినియైన అనంతశక్తి, బ్రహ్మయందున్నను లీనమైయుండుట వలన సృష్టి కల్గుటలేదు. అందువలననే బ్రహ్మ సృష్టిలో అశక్తుడగు చున్నాడు. నిరావరణాకాశమునందు సూర్యుని వెలుతురు మేఘము పక్షి మొదలగునవి యేవియు లేనపుడు ప్రకాశింపదు. బ్రహ్మయందలి ఈ విమర్శశక్తి సమ్ముఖముగా ఉండకపోయినచో ఆ నిర్గుణ నిష్కలనిరంజ నాత్మయందు ఏ శక్తియు స్ఫురింపదు. శ్రీ దేవీస్వరూపమును ఈవిధముగా తెలియుట ప్రతి ముముక్షువునకును అవశ్య కర్తవ్యము. ఇట్లు తెలియువాడు మహాత్రిపురసుందరీ రూపుడు. ఇట్లే శ్రీ దేవీ చక్రజ్ఞానము పొందుటయు అత్యంత మావశ్యకము. శ్రీయంత్ర రూపమైన శ్రీ త్రిపురసుందరీదేవీ విగ్రహము జాగ్రత్స్వప్న సుషుప్తిమయముగా, ప్రమాతృప్రమేయ ప్రమాణరూపముగా, సూర్యచంద్రాగ్నిరూపముగా, చెప్పబడుచున్నది. ఈ విధమున శ్రీచక్రము విశ్వమయమైనట్లు శబ్దసృష్టిలో మాతృకామయ మగుచున్నది. దీనియందు శబ్దార్థ భేదమున ద్వివిధ సృష్టి యున్నది. అర్థసృష్టి తత్వాత్మికము. శబ్దసృష్టి మాతృకారూపము. మాతృక, స్వరములని, స్పర్శలని, వ్యాపకమని చెప్ప బడుచున్నది. ఇదియే చాంద్ర సౌర ఆగ్నేయ ఖండములుగా వ్యవహరింపబడుచున్నది. ఈశరీరమందును మూడు భాగములు సోమసూర్యాగ్నిరూపములు. "చతుర్భిః శివచక్రైశ్చశక్తి చక్రై

శ్చ పంచభిః" "శివశక్త్యాత్మకంజ్ఞేయం శ్రీచక్రం శివయోర్వపుః" ఈశ్రీచక్రము తేజస్త్రయాత్మకము. ప్రమాతృ ప్రమాణ ప్రమేయరూపమున పురత్రయాత్మకము. వీనియందు బిందు త్రికోణ అష్టారఅష్టదళరూపమగు ఆగ్నేయఖండము మాతృపురము. దశారద్వయము చతురస్రరూపముఅగు సౌరఖండము ప్రమాణపురము. చతుర్దశారము షోడశదళరూపము అగు చంద్రఖండము ప్రమేయపురము. దీనినే ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులనుగా నాదబిందుకళారూపముగా గ్రహింపవలయును.

లింగశరీరమున సుషుమ్నానాడి ననుసరించి అనేక పద్మము లున్నవి. ఆయినను నవచక్రసాదృశ్యమున, నవపద్మములుల్లేఖింపబడుచున్నవి. సుషుమ్నకు రెండు ప్రదేశము లందును ఊర్ధ్వముఖముగా అధోముఖముగా రెండు సహస్రరము లున్నవి. ఈ రెండిటిమధ్య తొమ్మిది చక్రములున్నవి.

| | | | |
|---|---|---|---|
| ౧ భ్రూమధ్యము | అజ్ఞ | ద్విదళము | బిందు |
| ౨ లంబిక | ఇంద్రయోని | అష్టదళము | త్రికోణ |
| 3 కంఠము | విశుద్ధి | షోడశదళము | అష్టకోణ |
| ౪ హృదయము | అనాహతము | ద్వాదశదళము | అంతర్దశార |
| ౫ నాభి | మణిపూరకము | దశదళ | బహిర్దశార |
| ౬ వస్తి | స్వాధిష్ఠానము | షడ్దళ | చతుర్దశార |
| ౭ మూలాధారము | మూలాధారము | చతుర్దళ | అష్టదళ |
| ౮ తదధోదేశము | కులము | షడ్దళ | షోడశదళ |
| ౯ తదధోదేశము | అకులము | సహస్రదళ | భూపుర |

బ్రహ్మరంధ్రమందున్న మహాబిందువు సహస్రారము. ఇవ్విధముగా శ్రీచక్రమునకు శరీరచక్రమునకును ఐక్యసంపాదన చేయవలయును. మాతృకాచక్రమునకును ఐక్యమును సంపాదింపవలయును. ఏయే దళమునందు ఏయే వర్ణములు కలవో వానిని సంప్రదాయమున తెలియవలయును. శ్రీచక్రముయొక్క ఆకారము రెండు రెండు త్రికోణముల పరస్పర సంబంధముచే కల్గుచున్నది. ఈ విధమున ఇందులో తొమ్మిది త్రికోణములు కలవు. ఇట్టి రచనలవలన పిండాండమున బ్రహ్మాండమును, బ్రహ్మాండమున పిండాండమును సమావేశము పొందుట సూచింపబడుచున్నది. శ్రీచక్రము సృష్టిస్థితి సంహారాత్మకమని చెప్పబడుచున్నది. బిందుచక్రము ప్రకృతి స్వరూపము. మిగిలిన అష్టచక్రములు ప్రకృతి వికృత్యుభయాత్మకములు. బిందుత్రికోణాష్టారములు సృష్టిచక్రములు. దశారద్వయము చతుర్దశారము స్థితిచక్రము. అష్టదళము షోడశదళము భూపురము సంహారచక్రము. బింద్వాది భూపురాంతము సృష్టిక్రమమని భూపురాది బింద్వంతము సంహారక్రమమని చెప్పబడును. బిందువు మొదలు భూపురపర్యంతము కల విశేషచక్రముల వివరణమును ఈ క్రిందివిధమున తెలియవలయును.

సకల స్థూల సూక్ష్మజగత్తు లన్నియు పరమాత్మలో విలీనమైనప్పుడు బ్రహ్మ ఒకటియే స్వరూపావస్థితమై యుండును. ఆదశావస్థితి మహాబిందువుగా చెప్పబడును. అచట భాస్యభాసక భావము కాని యే ఇతర భావములు కాని

లేవు. ఇదియే శివవిశ్రామమని చెప్పబడును. ఆది విమర్శ మయి అగు మహాశక్తి శివునియందు అంతర్లీనమై ప్రకాశ మయమై యుండును. మరల కొంతకాలమునకు విశ్వసృజ నేచ్ఛ కలుగగనే ప్రకాశాత్మకతకు వేరుగా పరబ్రహ్మకు సమున్ముఖమై యుండును బ్రహ్మను తనకు సమ్ముఖినిని చేసికొనును. ఇద్దరును దర్పణమువలె నిర్మలినభావము కల వారగుటవలన ఒకరియందొకరు ప్రతిబింబనము పొందుదురు. అప్పుడు శివశక్తి సంపుటరూపమైన అహంవిమర్శమయమగు ఆద్యశక్తి ప్రాదుర్భావము పొందును. సంపూర్ణ విశ్వమంతయు దీనియం దిమిడియున్నది. బిందువు మహాబిందువులయొక్క అంతర్గతమైన ఈ అవస్థలు యోగిమాత్ర గమ్యములు. ఈ బిందువు అహంభావ రూపము. అకారము సర్వ వర్ణములకు మొదటిది. అది ప్రకాశాత్మకము. అదియే పరమశివుడని చెప్పబడును. హకారము అంత్యవర్ణము విమర్శయని చెప్ప బడుచున్నది. ఈ శ్రీ చక్రములోని బిందువు ప్రకాశవిమ ర్శాత్మకము. అందువలననే ఆ రూపాత్మకము ఈ బిందువు నందు బీజరూపమున ప్రపంచమంతయు నుండుటచే సమస్త చక్రమును దీని యంతర్గతమై యున్నది. కావుననే బిందు చక్రము ప్రధానచక్రము. ఈ బిందుచక్రమందు శ్రీ కామే శ్వరునితో శ్రీ కామేశ్వరి నిత్యానందమయ రూపిణియై విహార మొనర్చును. అందువలననే ఇది సర్వానందమయ చక్రము.

శ్రీ

త్రికోణచక్రము ననుసరించి ఈ క్రిందివిధమున తెలియ వచ్చును. విమర్శశక్తి సృష్టిని కలుగచేయవలయు ననెడి ఇచ్ఛచే బిందురూపమున ప్రకటమగును. ఈ బిందు భావ మందు సర్వప్రపంచవాసన, జ్ఞేయ జ్ఞాతృ జ్ఞాన భావములు, సూక్ష్మభావమున లీనములై యున్నవి. తనయం దంతర్లీనమై యున్న జగత్తును వ్యక్తము చేయ వలయు ననెడి ఇచ్ఛచే బిందువు త్రికోణరూపమున పరిణతమైనది. బిందురూపమైన పరా వాక్కు-నుండి పశ్యంతీమధ్యమా వైఖరీ రూపమగు త్రిపుటీద్వార మున త్రికోణాత్మకమగు శబ్దసృష్టి అభివ్యక్తమగుచున్నది. పశ్యంతి మొదలగునవి మూడును కార్యబిందువులు. బిందు రూపమైన పరావాక్కు- సకల శబ్దములకు జనని. అట్లే సకలార్థ రూపములైన ముప్పదిఆరు తత్వములకును మాత. తాంత్రిక మతానుసారమున తత్వములు ముప్పది ఆరు. పంచమహా భూతములు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియ ములు, పంచేంద్రియవిషయములు, మనోబుధ్యహంకారములు, ప్రకృతిపురుషులు, కలా, అవిద్య, రాగ, కాల, నియతి, మాయా, శుద్ధవిద్యా, ఈశ్వర, సదాశివ, శక్తి, శివులని ఆ తత్వములు. దేహముకూడ నవచక్రమయమగుటవలన దేహ సృష్టికిని బిందు వే కారణము. త్రికోణమే యోనిచక్రమని, శక్తి చక్రమని, జీవత్రికోణమని విసర్గమని చెప్పబడుచున్నది. జీవుడు త్రికోణము. జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలు ఈ మూడు కోణములు. ఈశక్తి అంతర్ముఖమై శుద్ధాహంభావ మును పొంది శివరూపమున విశ్రామము పొందును. బహి

ర్ముఖమై జీవభావమున సంభవించును. వాస్తవముగా శివ జీవులు భిన్నులు కారు. అంతర్ముఖ బహిర్ముఖ దృష్టి భేదమున మహాశక్తికే ఆ రెండు పేరులు. కావుననే బింసు త్రికోణముల కంతరము లేదు. ఈ త్రికోణశక్తి మాతృమేయమానములని, జ్ఞాతృజ్ఞేయజ్ఞానములని, హరిహర హిరణ్యగర్భులు ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులని, మనోబుధ్యహంకారములని, సత్వరజస్తమో గుణములని, చెప్పబడుచున్నది. త్రిగుణరూపిణియైన శ్రీదేవి త్రికోణరూపమును పొందినది. అష్టారచక్రమును ఈక్రింది విధముగా తెలియవలయును. దీనియందు శుద్ధవిద్య ఈశ్వర సదాశివులతోపాటు నాల్గుతత్వములున్నవి. ఈనాల్గు తత్వ ములును శివచతురస్రము లనబడును. జీవుడును శివరూపుడే. బహిర్ముఖోపాధివలన, కాలరాగ అవిద్యా కంచుకము కల్గి యున్నాడు. ఇవి జీవచతురస్రములు. ఈరెండింటి సంబం ధమున అష్టకోణాత్మకమగు అష్టారము సిద్ధమగుచున్నది. ఇదియే నవయోనిచక్ర మనబడుచున్నది. అష్టకోణమందు సిద్ధమగునట్టి అష్టయోని చక్రములును, మహాత్రికోణరూప మైన యోనిచక్రమును కలసి నవయోనిచక్రాత్మకతను పొందు చున్నవి. ఈచక్రత్రయము ప్రమాతృపురము. అగ్నిఖండ మని చెప్పబడును. బిందుచక్రము ఇచ్ఛారూపము. త్రికోణము జ్ఞానరూపము. అష్టారచక్రము క్రియారూపము. త్రికోణము నకు సర్వసిద్ధిప్రదాయక చక్రమనిపేరు. అష్టారమునకు సర్వ రక్షాకరమని పేరు.

పాశాంకుశ ధనుర్బాణములానాల్గు ఆయుధములు. కామేశ్వర కామేశ్వరీ తేజస్సుల పృథక్సంయోగమువలన ఎన్మిదాయుధము లుత్పన్నము లగుచున్నవి. ఇవియే అష్టారమం దున్నవి. అంతర్దశార బహిర్దశార చక్రములను యీవిధముగా తెలియవలయును. అంతర్దశార బహిర్దశార ద్వారమున లింగ శరీరప్రాదుర్భావము భాసించును. అంతర్దశారముయొక్క దశ కోణములలో పంచజ్ఞానేంద్రియములు పంచకర్ణేంద్రియములు ఘటితములైయున్నవి. కామేశ్వర కామేశ్వరీరూపమైన తేజో యుగ్మము వశిన్యాదిరూపముననుండి అంతర్దశారమందు ఇంద్రియరూపమున పదిగా విభక్తమగుచున్నది. దీనికి సర్వరక్షాకరచక్రమనిపేరు. బహిర్దశారమునకు సంబంధించిన పదికోణములు దశేంద్రియ విషయములు. పూర్వము చెప్పబడిన తేజో యుగ్మము దశధావిభక్తమైన సర్వసిద్ధిప్రదాది దశదేవతల రూపమున పూజల పొందుచుండును. ఈ బహిర్దశారమందు నాల్గుకోణములందు నాల్గుమర్మస్థానములున్నవి. అంతర్భాగ మందు నాల్గుత్రికోణములను భావింపవచ్చును. ఈనాల్గు త్రికోణములందు ఒక చతురస్రమును భావింప వీలున్నది. ప్రకృత్యహంకారబుద్ధి మనస్సులు. అచటి నాల్గు తత్వములు. ఈదశారద్వయము సారఖండము. ప్రమాణపురము. జాగ రాత్మకము.

చతుర్దశారమును ఈ విధముగా తెలియవలయును. దీనికి సర్వసంక్షోభిణీశక్తియనిపేరు. పిండాండమునందు దశేంద్రియములు మనోబుద్ధి చిత్తాహంకారములు పదునాలుగుగా

మాధవ

శ్రీ

నున్నవి. ఈ చతుర్దశారము చంద్రఖండము. ఇది సుషుప్తి పురము. అష్టదళ షోడశదళ భూపురములను ఇట్లు తెలియవలయును. అష్టదళచక్రమందు అనంగకుసుమాది దేవీరూపమున తేజోయుగ్మము పూజనుపొందును. సర్వసంక్షోభణ చక్రమనిపేరు. ఈఅష్టదళము అష్టాంతరచక్రభూతము. అందువలన ఆగ్నేయ ఖండము. అష్టదళపద్మము అవ్యక్తద్వ్యష్టకారణములతో నిర్మింపబడినది. షోడశదళము విసర్గరూపము, చంద్రుని షోడశకళాయుక్తమై యున్నది. మొదట చెప్పిన తేజోమిధునమునకు కామాకర్షిణ్యాది రూపమున ఇచటపూజలు జరుగును. దీనికి సర్వాశాపరిపూరకమనిపేరు. భూపురచక్రమందు అణిమాదిసిద్ధులు బ్రాహ్మ్యాదిలోకమాతలు ముద్రలు కూడుకొని యున్నవి. తద్రూపమున తేజోమిధునము పూజలపొందును. దీనికి త్రైలోక్యమోహన చక్రమనిపేరు. ఈ చక్రము గంగా యమునా సంగమరూపమైన తీర్ధరాజమగు ప్రయాగయని చెప్పబడినది. ఈ భూపురమున శివజీవుల సమష్టిరూపము.

షోడశదళాంతమందు రేఖాత్రయమును కొందరు పరిగణింతురు. కొన్ని సంప్రదాయములందు మర్యాదావృత్తమే కాని ఇతరవృత్తములులేవు. యంత్రలేఖనానుసారమున చూచినచో ఇతరవృత్తలేఖనమున కవకాశమేకన్పడదు. ఈ దేవీచక్రారాధనము సంప్రదాయ రహస్యముగా నున్నది. ఇచట బాహ్యాభ్యంతరపూజావిధానము గురుముఖైకవేద్యము. ఏక బిందువునందే శ్రీచక్రాంతర్గతములైన నవచక్రముల కంతర్భా

వమున్నట్లు ఒక సహస్రారబిందువునందే శరీరములోని షట్చక్రములకును అంతర్భావమున్నది. వాని నన్నిటిని దీక్షాసమ కాలమందు గురూపదేశ పురస్సరముగా తెలియదగియున్నది.

శ్రీ చక్రము నారాధించుటలో అనేక సంప్రదాయ భేదములు కలవు. భూపురము మొదలుకొని బింద్వంతము ఆవరణ పూజాక్రమమున తత్తన్మంత్రములతో పూజచేయుట ఒక విధానము. బింద్వాదిగా భూపురాంతము పూజచేయుటయు ఒక సంప్రదాయము. రెంటిని మేళనమొనర్చి పూజించుట కొన్నిఎడల సంప్రదాయముగా నున్నది. హాదికాది విద్యాయుగమున పూజచేయవలయు ననుట తాంత్రికుల నిర్దేశము. కకారాదిగా హకారాదిగా శ్రీ దేవీమంత్రము కలదని ప్రామాణికులు చెప్పుచున్నారు. సాంప్రదాయికులు ఆరాధించుచున్నారు. పాణిని మహర్షి హయవరట్ అను సూత్రములో హకారాదిగా వర్ణసమామ్నాయమును చెప్పుటచే ఆ అక్షర విద్యను హాదివిద్యగా స్వీకరించి తదక్షర సంపుటితో అర్చనచేయు విధానమును కలదు. ఆ యావిశేష సంప్రదాయ రహస్యములను గురుసన్నిధానమందు తెలియవలయునని మంత్రజ్ఞులు పలుకుచున్నారు.

## దేవీగీత

శ్రీతత్వము శ్రీదేవీ భాగవతాది గ్రంథములందు కథోపకథనాదులచే విస్పష్టముగా నిరూపితమైనది. అనంత

విలాసముతోనున్న శ్రీతత్వము సారాంశముగా తెలియుట దుస్తరమే. దేవీభాగవతమునందు సప్తమస్కంధములో దేవీగీత కూర్చబడినది. అందు దేవీస్వభావము విశదముగా నున్నది. అందు తొమ్మిదధ్యాయములు కలవు. మొత్తము మీద నాల్గువందల ముప్పదిమూడు శ్లోకములున్నవి. అందు హిమాలయము దేవతలు వ్యాసుడు శ్రీదేవి నల్గురుపాత్రలు. హిమవంతుడు ప్రశ్నింపగా శ్రీదేవి తత్వము నుపదేశించుట ఇందు నిబద్ధమైనది. గ్రంథము మొత్తమువీద హిమవంతుని శ్లోకములు ఆరు. వ్యాసునిశ్లోకములు ౨౨. దేవతల శ్లోకములు పదకొండున్నర. మిగిలిన మూడువందల తొంభైమూడు శ్లోకములు శ్రీదేవీవచనములు. శ్రీదేవీ గీతా సారమును ఈ క్రిందివిధమున తెలియవలయును.

భక్తిసహితమైన యోగమును శృతిసమ్మతమైన జ్ఞానమును ఉపదేశింప వలయునని హిమవాను డడుగగా ప్రసన్న ముఖపంకజము గల జగదంబ శ్రుతినిగూహితమైన రహస్యమును ఇట్లుపదేశించుచున్నది. ఉపదేశించుచున్న నావచనమును అందరును సావధానులరై వినుడు. శ్రవణమాత్రమున నారూపము కల్గును. పూర్వము నేనే యుంటిని. నాకన్న నతిరిక్తముగా నేదియు లేదు. చిత్సంవిత్ పరబ్రహ్మైక నామకమగు నా ఆత్మరూప మున్నది. అది అప్రతర్క్యము. అనిర్దేశ్యము అనౌపమ్యము అనామయము. అట్టి బ్రహ్మనుండి మాయ అనబడు శక్తి వెలువడినది. అది స్వతస్సిద్ధమే. సద్రూపముకాదు, అసద్రూపము కాదు. ఉభయరూపమునుకాదు.

శ్రీ

వీటియన్నిటికి విలక్షణముగా వస్తువుగా ఆశక్తికలదు. అగ్నికి ఉష్ణతవలె సూర్యునకు కాంతివలే చంద్రునకు చంద్రికవలే ఆశక్తిసహజము. అదినిత్యము సుషుప్తిలో సకలవ్యవహారములు విలీనమగునట్లు ఆమాయ యందు జీవకర్మలు జీవులు సర్వ కాలములు అభేదమున విలీనములగును. మొదటి ఆత్మతత్త్వము శక్తి సమాయోగమున బీజత్వమును పొందును. ఆత్మధార ఆవృతమగుటవలన శక్తిదోషములు ఆత్మయందు లగ్నము లైనవి. చైతన్యసమాయోగమున ఆ శక్తియే నిమిత్తము. ప్రపంచరూపమున అదియే పరిణమించుటనుబట్టి ఆ మాయా శక్తి సమవాయికారణమును అగుచున్నది. కొందరా మాయా శక్తిని తమస్సందురు. కొందరు జడమందురు. జ్ఞానము, మాయ, ప్రధానము. ప్రకృతి, శక్తి, అజ, విమర్శము అనియు నందురు. వీరందరును శైవశాస్త్రవిశారదులు. వేదతత్వార్థచింతకులగు మరికొందరది అవిద్యయనుచున్నారు. నిగమములలో ఆశక్తికే అనేక నామములున్నవి. అది దృశ్యమగుటవలన జడము. జ్ఞానముచే నశించును కావున అసద్రూపము. చైతన్యమెన్నడు దృశ్యముకాదు. దృశ్యత్వమున్నచో అదియు జడమగునుకదా చైతన్యము స్వప్రకాశము. అది ఎన్నడు పరప్రకాశముకాదు. తనచే తాను ప్రకాశింపబడుటయు అచటలేదు. అట్లే అయిన అనవస్థవాటిల్లునుగదా! కర్తృవిరోధము కల్గునుగదా! కావున ఆ ఆత్మచైతన్యము దీపమువలే స్వప్రకాశము. పరప్రకాశ మును అగును. ఓ హిమవానుడా! నేను సంవిన్మయపరా దేవిని. అందువలననే నాకు నిత్యత్వముసిద్ధము. జాగ్రత్స్వప్న

సుషుప్త్యాదులలో దృశ్యమంతయు వ్యభిచరితమై భాసించుట లేదు. సంవి త్తత్వముమాత్రము సర్వావస్థలందును ఏకవిధము గనేయున్నది. అది వేరొకదానిచే తెలియబడునదికాదు. అన్నిటిని తెలియునది ఏదికలదో అదియే సంవిన్మయమగు దేవీ తత్వము. కావుననే సచ్ఛాస్త్రకోవిదులు నిత్యత్వమును చెప్పు చున్నారు. పరమప్రేమాస్పదమగుటవలన ఆనందరూపత్వ మును నిశ్చయించుచున్నారు. సర్వము మిధ్య- కావుననే నాకు అసంగత్వము స్ఫుటము. ఈదృశ్యమానమంతయు పరి చ్ఛిన్నము. నాతత్వము అపరిచ్ఛిన్నము. ఈసంవిన్మయమగు జ్ఞానము ఆత్మధర్మముకాదు. అట్లైయైన ఆత్మజడము కావలసి వచ్చును. జ్ఞానము జడశేషమనుట ఎన్నడును సంభూతము కాదు. జ్ఞానము చిద్ధర్మమునుకాదు. చిత్తునకు చిత్తుధర్మము కాదుగదా. కావున ఆత్మ జ్ఞానరూపుడు, సర్వదా సుఖరూ పుడు, సత్యరూపుడు, పూర్ణరూపుడు, అసంగుడు, ద్వైతజ్వాల రహితుడు. ఆ ఆత్మ కామకర్మయుక్తమైన తన మాయచే పూర్వసంస్కారమున కాలకర్మవిపాకమున తత్వావివేకమున సిసృక్షు కలవాడగును.

ఓ హిమవానుడా! ఈసృష్టి అబుద్ధిపూర్వకము. నా యీ అలౌకికరూపము అవ్యాకృతము అవ్యక్తము. సర్వ కారణకారణము అని సర్వశాస్త్రముల చెప్పబడుచున్నది. సర్వతత్వముల కిదియే ఆది భూతము. ఇది సచ్చిదానంద విగ్రహము. ఇచ్ఛాజ్ఞానక్రియలకు ఇది ఆశ్రయభూతము. హ్రీంకారమంత్రముచే ఇది చెప్పబడుచున్నది. అందువలన ఇది

ఆది తత్వము. దానినుండియే ఆకాశాది భూతము లుత్పన్నములయినవి. అపంచీకృత మహాభూతములవలన సూక్ష్మదేహముకల్గినది. పంచీకృతమహాభూతములవలన సృష్టి యంతయు ఉత్పన్నమైనది. జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు ప్రాణమనోబుద్ధులతో కూడుకొనిన శరీరము లింగశరీర మనబడును. తనను ఆశ్రయించినవానిని రక్షించునది కావున మాయ అనబడుచున్నది. అట్టి సత్వ ప్రతిబింబము పొందిన పరమేశ్వరుడే ఈశ్వరు డనబడును. ఆతడు సర్వజ్ఞుడు. సర్వకర్త. సర్వానుగ్రహకారకుడు. అవిద్యాప్రతిబింబము జీవుడుగా చెప్పబడును. ఆతడు సర్వదుఃఖములకు ఆలయము. అవిద్యావశమున జీవేశుల కిద్దరకును దేహత్రయము కల్గినది. ఆదేహత్రయాభిమానమున నామత్రయము కల్గినది. ఈశసూత్రవిరాట్ పదములచే ఈశ్వరుడు చెప్పబడును. ఈతడు సమష్టిరూపుడు. ప్రాజ్ఞతైజసవిశ్వభేదమున జీవుడు పరిగణింపబడును. ఈతడు వ్యష్టిరూపుడు. ఆసర్వేశ్వరుడు జీవానుగ్రహబుద్ధితో నాశక్తిప్రేరితుడై నాయందు కల్పితమై నానాభావాశ్రయమైన ఈవిశ్వమునంతను సృజించుచున్నాడు. ఈదృశ్యమానమగు చరాచర ప్రపంచ మంతయు మాయాశక్తిరచితము. పరమార్థముగా మాయ యనునది బ్రహ్మకన్న వేరుకాదు. వ్యవహార దృష్టిలో అదియే మాయయని అవిద్యయని చెప్పబడును. మాయాభేదములు ఏయే విధముననుండునో కర్మభేదములు నట్లేయుండును. హిమవన్! ఈ జగత్తునంతను సృజించి దానియందు నేను ప్రవేశించెదను. ఉపాధి భేదము వలన నేను



భిన్నముగా నుండును. ఎన్నివస్తువుల భాసింపచేయు చున్నను సూర్యునకు వస్తుదోషము సంబంధింపదు. అట్లే ఏదోషమును నాకు లేదు. బుధ్యాదుల కర్తృత్వమును అబుద్ధులు కొందరు నాయం దారోపించి నాకు కర్తృత్వమును చెప్పుదురు. ఘటాకాశమహాకాశములకు భేదము కల్పితమైనట్లు జీవేశ్వర విభేదమును కల్పితము. జీవభేదమున అవిద్యయే హేతువు. నాయందీ సర్వమును ఓతప్రోతమై యున్నది. బ్రహ్మ విష్ణు మహేశ్వరులను నేనే. గౌరీ బ్రాహ్మీ వైష్ణవ్యాది రూపమున ఉండునది నేనే. పశుపక్షిస్వరూపమున సదసత్ కర్మరూప మున స్త్రీ పుంనపుంస కాకారమున ఉండునది నేనే. నాకతి రిక్తముగా ఏదియు లేదు. అన్నిటియందు నేనే వ్యాపించి యున్నాను. సర్పాదిబుద్ధులు ఎన్ని కల్గినను రజ్జువొకటియే. కల్పితవస్తు వేదియు అధిష్ఠానముకన్న అతిరిక్తముకాదు. ఆత్మ సత్తయే అన్నిటికిని సత్తను ఆపాదించును.

ఇంతదనుక శ్రీదేవి ఉపదేశింపగా హిమవానుడు సమష్టిరూపమగు శ్రీదేవీస్వరూపము చూడవలయునని ప్రార్థిం చెను. దేవతలందరు ఆవచనములను అనుమోదించిరి. భక్త కామప్రపూరిణి అగు శ్రీదేవి పరాత్పరమగు తనవిరాడ్రూప మును ప్రదర్శించినది. ఆకాశము మస్తకము. చంద్రసూర్యులు నేత్రములు. దిక్కులు శ్రోత్రములు. వేదములు వాక్కులు. వాయువు ప్రాణము. విశ్వము హృదయము. పృథివి జఘనము, ఆకాశము నాభి. నక్షత్రపథము వక్షఃస్థలము. మహర్లోకము కంఠము. జనోలోకము ముఖము. ఇంద్రాదులు బాహువులు.

ముఖము అగ్ని. యముడు దంష్ట్రలు. హాసము మాయ. శ్రీ జగదంబకు చంద్రుడు మనస్సు. అతలాదిమహాలోకములు కటి అధోభాగత్వమును పొందినవి. జ్వాలామాలికల సహస్రములతో ఉన్న జిహ్వతో ఆస్వాదించుచున్న దంష్ట్రల, కట కటారావముతో నేత్రద్వారమున అగ్నిని వెడలగ్రక్కుచున్న సహస్రశీర్షనయనము కోటిసూర్యప్రతీకాశము విద్యుత్కోటి సమప్రభము అగు భయంకర మహాఘోరరూపమును చూచి దేవతలందరు హాహాకారము చేసిరి. ఈమె జగదంబ అనెడు స్మరణము పోయినది. నలుదిక్కుల ప్రసరించిన వేదనినాదములు వారలను మేల్కొల్పినవి. ప్రబోధముకల దేవతలు శ్రీదేవిని స్తవమొనరించిరి. జగదంబా! క్షమింపుము. నీ భయంకర రూపమును ఉపసంహరింపుము. నీ సుందరసుందరమగు ఆ దివ్య మధురరూపము దర్శింపుము. కృపాసముద్రులైన ఆజగన్మాత ఘోరరూపము నుపసంహరించగా పాశాంకుశవరాభీతిధరము, సర్వాంగ కోమలము, కరుణాపూర్ణనయనము, మందస్మిత ముఖాంబుజమునగు ఆసుందర రూపమునుచూచి దేవతలు భీతిరహితులైరి. శాంతచిత్తులై నమస్కరించిరి.

శ్రీదేవి మరల ఇట్లుపదేశించెను. మీరు మందభాగ్యులు. నావాత్సల్యమున మీకీరూపదర్శన భాగ్యము కల్గినది. వేదాధ్యయన యోగదాన తపఃప్రభృతు లెన్నియున్నను నా కృపలేకున్న ఈరూపదర్శనము కలుగదు. హిమవన్! మరల వినుము. ఉపాధియోగమువలన ఆత్మకర్తృత్వము పొంది

శ్రీ

ధర్మాధర్మ హేతువులగు నానాక్రియల చేయును. నానా యోనుల పొందును. సుఖదుఃఖముల కూడుకొనును. సంస్కార వశమున నానాకర్మరతుడై నానాదేహముల పొందును. ఘటీ యంత్రమువలె రాకపోకల కూడుకొనునే కానివిరామము లేదు. అజ్ఞానము మూలముగా కామముకల్గును. కావున మూలనాశన మునకు ప్రయత్నింపవలయును. అజ్ఞాననాశనమున విద్యలభిం చును. విద్యఒక్కటియే అజ్ఞాననాశమున హేతువు. కర్మోపాస నలు సమర్థములుకావు. కైవల్యము జ్ఞానము వలననేకల్గును. ఆజ్ఞానసంపాదనమున్నను కర్మల నవశ్య మాచరింపవలయును. జ్ఞానకర్మలకు సంబంధము లేదు. తమః ప్రకాశములవలే ఆ రెం డును విరుద్ధములు. సర్వవైదికకర్మలు చిత్తశుద్ధికిసమర్థములు. శమము, దమము, తితిక్ష, వైరాగ్యము, కలుగువరకు కర్మల నాచరించి సన్యసింపవలయును. నిర్వ్యాజభక్తితో బ్రహ్మ నిష్ఠుడగు శ్రోత్రియుడైన గురువును సేవింపవలయును. వేదాన్త శ్రవణము మహావాక్యార్థ విచారణము గురుసన్నిధానమున నొనర్పవలయును. "తత్వమసి" అను మహావాక్యము జీవ బ్రహ్మల కైక్యము బోధించుచున్నది. దేహత్రయమందు పంచ కోశములు అంతస్థములై యున్నవి. పంచకోశ పరిత్యాగము వలన బ్రహ్మపుచ్ఛము లభించును. ఆబ్రహ్మయే ఆత్మ. దాని కేవికారములునులేవు. అది అణువులలో అణువు. మహత్తు లలో మహత్తు. అమనస్కుడు సంసారపదమునే పొందును. సమనస్కుడై సాధకుడు తత్పదమును పొందవలయును. విజ్ఞాన సారథియై మనోనిగ్రహముకల మానవుడు అధ్వపారమును

పొందును. దేవీప్రణవరూపమగు అక్షరత్రయమును బాలింప వలయును. ఇదియే శ్రీదేవీ ప్రణవము. ఇందలి హకారము స్థూలదేహము. రకారము సూక్ష్మదేహము. ఈకారము కారణాత్మ. అనంతర బిందువు తురీయము. ఇట్లు వ్యష్టిదేహమున భావించి సమిష్టిలోకూడ గ్రహింపవలయును. మతిమంతుడైనవాడు వ్యష్టిసమష్టిరూపముల కేకతత్వము చూచును. సమాధికాలమునకు పూర్వమట్లు భావనచేసి నిమీలితాక్షుడై శ్రీదేవినగు నన్ను నిర్వ్యాజభక్తితో ధ్యానింపవలయును. హ్రీం అనునట్టి దేవీ ప్రణవములోని ఆయా అక్షరములను చివరనున్న నాదాంతమందు లయింపచేయవలయును. అచటి భావనలో వాచ్యవాచకతా హీనమైన ద్వైతభావరహితమగు అఖండసచ్చిదానంద భావము భాసించును. ఇట్లు భావింప గల్గువాడే అజ్ఞాననాశకుడు కాగలడు.

సంపత్ప్రదాయకమగు యోగములను ఉపదేశింపవలయునని హిమవానుడు కోరుకొనెను. శ్రీదేవి ఇట్లుపదేశించినది. జీవాత్మలయోగమే యోగము. ఆయోగ విఘ్నకరములు ఆరుకలవు. యమ, నియము, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధులతో ఆవిఘ్నములను పోగొట్టుకొనవలయుచు. ఈ యోగప్రణాలికయొక్క ప్రభావమున మూలాధారమందున్న శ్రీశక్తి ప్రబోధమును సంపాదించి బిందుచక్రమును పొందింపవలయును. సహస్రారమందున్న భవమహాలింగముతో కుండలినీరూపమగు పరాశక్తిని ఏకీభూతముగా చింతింపవలయును. లాక్షారసమువలె అచట

అమృతము ద్రవించును. ఆ అమృతద్రవముచే శక్తిని తృప్తి పొందించి షట్చక్ర దేవతలనారాధించి మరల ఆశక్తిని మూలాధారమున ప్రవేశింప చేయవలయును. ఇట్లు నిత్యము అభ్యసించువానికి మంత్రములు సిద్ధిప్రదములగును. శ్రీదేవీసంవిద్రూపమందు మనస్సునకు లయముకల్గు పర్యంతము ఏదియేని ఒకస్థానమున విశుద్ధచిత్తముతో అభ్యాసమొనరింపవలయును. ఈవిధముననే జప హోమాదులు ఫలప్రదములు కాగలవు. యోగములేక మంత్రముకాని మంత్రములేక యోగము గాని సిద్ధిప్రదము కాజాలదు. ఇట్టి యోగయుక్తుడై బ్రహ్మరూపిణియైన నన్ను ధ్యానింపవలయును. సర్వవిధానముల ఈతత్వమే పొందదగినది. ఇట్టి ఆరాధన చేయువాడు దివ్యబ్రహ్మకాశమందు ఆత్మయై సంప్రతిష్ఠితుడగును. పరావరమగు ఆతత్వము గోచరముకాగనే సర్వసంశయములు భిన్నములగును. అదియే బ్రహ్మ. అంతకన్న వేరుకలదని భావించినయెడల ప్రమాదమున్నది. హిమవన్! జ్ఞాని హృదయాంభోజ మధ్యమందు నేనుందును. అభక్తునకీతత్వమును చెప్పరాదు. ఈవిద్యను ఉపదేశించునాతడే పరమేశ్వరుడు. ఆతడు బ్రహ్మజన్మ ప్రదాయకుడగుటవలన పితరులకన్న అధికుడు. బ్రహ్మదాతయే ఉత్తమగురువని శాస్త్రములు చెప్పుచున్నవి.

విరాగికానట్టి సామాన్యుడైన మధ్యమ మానవునకు భక్తి నుపదేశింపుమని హిమవానుని ప్రశ్న. శ్రీదేవి ఇట్లుపదేశించినది. మోక్షప్రాప్తిలో మార్గములు మూడుకలవు.

 మాధవ

(శ్రీ)

అవి కర్మజ్ఞాన భక్తియోగములు. మానవుల గుణభేదమున భక్తియు మూడువిధములు. సాత్వికభక్తి పరభక్తిని సంపాదింపచేయును. పరానురక్తితో అనన్యగతికుడై నన్నే చింతనము చేయు సాధకుడు నన్ను తెలియగలడు. ఆతడు నా రూపమునసే జీవముల చింతనముల చేయును. చైతన్య మంతటను సమానమేగదా. అనన్య భక్తి భావముతో నాదు మంత్ర తంత్రములందాసక్తుడై సాత్వికభక్తుడు నన్ను పూజించును. నిత్యనైమిత్తికములగు నాదివ్యవ్రతముల నాచరించుచు విత్తశాఠ్యములేక నాయుత్సవముల చూచుచు నన్నే చింతనము చేయుచు గానము చేయువాడు పరభక్తుడు. ఈపరా భక్తికల్గినచో నాచిన్మాత్రలయము కల్గును. అట్టి భక్తిని ప్రదర్శించినను ప్రారబ్ధవశమున ఎవనికైన జ్ఞానము కలుగక పోయినచో ఆతడు నామణిద్వీపము పొందును. అచట అనేకభోగముల పొందగలడు. ఏకజన్మలో జ్ఞానముకలుగదు. అనేక జన్మసంశుద్ధి అచటనపేక్షితము. ప్రథమవర్ణజన్మ వేద ప్రాప్తి శమాది సంపత్తి యోగసిద్ధి ఉత్తమగురుప్రాప్తి ఇవి సాధారణముగా దుర్లభములు. క్షీరములందు ఘృతమువలే మానవునందు విజ్ఞానము గూఢముగా నుండును. ఆజ్ఞానమునకైమానవుడు ప్రయత్నింపడేని ఆతనిజన్మ నిరర్థకమగును. జ్ఞానమును పొంది సాధకుడు కృతార్థు డగునని సర్వవేదాంత డిండిమము.

పరమేశ్వరీ! ఏ ఏ స్థానములు భూతలమున చూడ తగినవి? ఎయ్యవి పవిత్రములు? ఏ ఏ వ్రతము లుత్తమ

ములు ? జగన్మాతా ! ఉపదేశింపుమని హిమవానుని ప్రార్థన.
శ్రీదేవి ఇట్లు చెప్పినది. నా స్థానములన్నియు చూడతగినవి.
నాకు సర్వకాలములును వ్రతాత్మకములు నేను సర్వవ్యాపి
ణిని. సర్వకాలములందును ఉత్సవము చేయవచ్చును. అయి
నను కొన్ని చెప్పెదను. కోలాపురము మాతృపురము తులజా
పురము హింగుల జ్వాలాముఖి శాకంభరి, భ్రామరిరక్తదంతికా
స్థానము దుర్గాస్థానము వింధ్యనివాసిని అన్నపూర్ణాస్థానము
చంద్రలకాళికి శ్రీనగరము నీలసర్వతి మణిద్వీపము ఇట్టి
వనేకములు కలవు. కామాఖ్యాయోనిమండలము ఉత్తమ
స్థానము. ప్రతి మాసమును దేవి సాక్షాద్రజస్వలయై నివ
సించును. అచటిసర్వదేవతలును పర్వతాత్మకతను పొందును.
పర్వతములందును అధిష్ఠానదేవత లున్నారు. అచటి పృధివి
యంతయు దేవీరూపము. కాశీనగరమందు సర్వక్షేత్రములును
కలవు. శ్రీ దేవీ భక్తితత్పరుడై మానవుడు నిత్యమచట
వశింపవలయును. ఈ పైచెప్పిన దేవీనామములను ప్రాతస్సమ
యమున పఠించువాడు సర్వపాపరహితుడగును. స్త్రీలును
పురుషులును ఆచరింపతగిన ఈ ఉత్తమ వ్రతములను వినుము.
అనంతతృతీయ, రసకల్యాణీవ్రతము, శుక్రవారవ్రతము, కృష్ణ
చతుర్దశి, భౌమవారవ్రతము, ప్రదోషవ్రతము, ఇట్టి వ్రతము
లున్నవి. ప్రదోషవ్రతమందు మహాదేవుడు శ్రీదేవిని సింహా
సనమున సంస్థాపించి నిశాముఖమున దేవతలతో నృత్యము
చేయును. ఇట్లే సోమవారవ్రతము నవరాత్రవ్రతము మొద
లగునవి అనేకములు కలవు. ఇట్టి నిత్యనైమిత్తిక వ్రతము

లను మాత్సర్యరహితుడై చేయు మానవుడు నా సాయుజ్యమును పొందును. దోలోత్సవము, శయనోత్సవము, జాగరణోత్సవము, రథోత్సవము, పవిత్రోత్సవము, మొదలగునవి అనేకములు కలవు. వీనియందు సువాసినీ స్త్రీలను కుమారికలను శ్రీదేవీ బుద్ధితో ప్రతివత్సరమును ఆరాధింపవలయును. అట్టియాతడు కృతకృత్యుడు కాగలడు.

హిమవన్! జగదంబిక శ్రీదేవీ పూజావిధిని ఉపదేశించెదను వినుము. నాపూజ రెండు విధములు. ఒకటిబాహ్యము, వేరొకటి అభ్యంతరము. బాహ్యముకూడ వైదికమని తాంత్రికమని రెండువిధములు. మూర్తిభేదమున వైదికముకూడ రెండువిధములు. వేదదీక్షాసమన్వితులు వైదికమును చేయవలయును. తాంత్రికదీక్షాయుక్తులు తాంత్రికము నాచరింపవలయును. ఈపూజా రహస్యమును తెలియక విపరీతముగా ప్రవర్తించువాడు పతితుడగును.ముందుగా వైదికమునువినుము. నీ విప్పుడు చూచిన సర్వశక్తి సమాయుక్తమగు పరాత్పరరూపమును నిత్యము పూజింపవలయును. నమస్కరింపవలయును. ధ్యానింపవలయును. స్మరింపవలయును. దంభాహంకార రహితుడై తత్పరుడై తద్యాజియై తచ్ఛరణుడై, తన్మనస్కుడై తధ్యానము చేయవలయును. యజ్ఞతపోదానాదులచే ఆరూపమునే అనుసంధానింపవలయును. ముముక్షువగువాడు ధర్మమునకై వేదము నాశ్రయింపవలయును. వేదధర్మమును పరిత్యజించి ఇతరము నాశ్రయించువాడు పంక్తిగ్రాహ్యుడు కాడు. వామకాపాలిక కాలభైరవాద్యాగమములు మోహా

నార్థమై శివునిచే రచింపబడినవి. వాని ననుసరింపరాదు. యక్షశాపమున భృగుశాపమున దధీచిశాపమున దగ్ధులైన వేదమార్గబహిష్కృత బ్రాహ్మణులు ఉద్ధరింపబడుటకై, శైవ వైష్ణవసౌరశాక్తగాణపత ప్రభృత్యాగమములు ప్రణీతములైనవి. వానియందు వేదావిరుద్ధమైన వచనమును స్వీకరింపవచ్చును.

వేదాధికారములేని మానవుడు తంత్రాధికారమును పొందును. మూర్తియందుకాని స్థండిలమునకాని సూర్యచంద్ర మండలమునగాని, జలమున, బాణలింగమున, యంత్రమున, మహాపటలమున, హృదయాంభోజమున, పరాత్పరురాలగు, సగుణకరుణాపూర్ణతరుణి, అరుణారుణ, సౌందర్యసార, సీమాతీతసర్వావయవసుందర, శృంగారరస సంపూర్ణ, భక్తార్తిభంజని, కాతరప్రసాదసుముఖి, చంద్రఖండశిఖండిని, పాశాంకుశ వరాభీతిధర ఆనందరూపిణి, అగు, శ్రీదేవిని ధ్యానించి నానా విధోపచారములచే పూజింపవలయును. ఆంతర పూజాధికారము కల్గునంతవరకు ఈబాహ్యపూజ నాచరింపవలసినదే. ఉపాధిరహితమైన సంవిత్ నేనే. నారూపమైన సంవేదనమందు చిత్తమును స్థాపింపవలయును. సంవిద్రూపాతిరిక్తమగునదంతయు మిథ్య. సంసారనాశనమునకై ఆత్మరూపిణి అగు శ్రీదేవిని, యోగయుక్తుడై ధ్యానింపవలయును.

బాహ్యపూజావిస్తారమును మరల చెప్పెదను. సావధానముగా వినుము. ప్రాతఃకాలమున మేల్కొని తనశిరస్సునందు ఉజ్వల పద్మమును సంస్మరింపవలెను. ఆసముజ్వల పద్మములో తనరూపముననుండు కర్పూర సదృశుడైన శ్రీ

 మాధవ

గురువును భావింపవలయును. సుప్రసన్నుడైన శ్రీగురువును సంస్మరించి దేవీరూపమగు కుండలిని స్మరింపవలయును. "ప్రథమ ప్రయాణమున ప్రకాశమానమై ప్రతి ప్రయాణమున అమృతాయమానమై సుషుమ్నా పదవిలో సంచరించునట్టి ఆనందరూప అబలను శరణు పొందెదను" అని ధ్యానించి కుండలినీ శిఖామధ్యమున సచ్చిదానందరూపిణి అగు నన్ను ధ్యానింపవలయును. అనంతరము శౌచాది క్రియలను సమాప్తి పొందింప వలయును. పిమ్మట అగ్నిహోత్ర హోమ మొనరించి హోమాంతమందు పూజాసంకల్పము చేయవలయును. భూతశుద్ధి, మాతృకాన్యాసము, హృల్లేఖా మాతృకాన్యాసము నిత్యము సమాచరింపవలయును. మూలాధారమున హకారమును, హృదయమున రకారమును, భ్రూమధ్యమున ఈకారమును, శిరమున హ్రీంకారమును, న్యసింపవలయును. ఆయా మంత్రోదితము లైన ఇతరన్యాసములను కూడ ఆచరింపవలయును. బ్రహ్మ, విష్ణు రుద్రేశ్వరసదాశివులు పంచమహాప్రేతములు శ్రీదేవి పాదమూలము నాశ్రయించి యుందురు. వారు పంచభూతాత్మకులు. అచట శ్రీదేవి అవ్యక్తచిద్రూపిణియై యున్నది. శ్రీదేవికి వారు విష్టరత్వమును పొందిరి. అట్టి పంచప్రేతాసనాసీన అయిన శ్రీదేవిని హృదంభోజమున ధ్యానింపపలయును. మానసోపచారములతో పూజించి జపించి ఆజపమును శ్రీదేవి కర్పింపవలయును. అర్ఘ్యస్థాపనము, పాత్రాసాదనము, పూజాద్రవ్యములు, తగిన ప్రదేశములందుంచుకొని వానిని పరిశుద్ధిమొనర్చి, దిగ్బంధ మొనర్చి

గురువందనము చేసి, అనుజ్ఞను స్వీకరించి, బాహ్యపీఠమందు హృదయభావిత దివ్యమనోహర సుందరరూపముకల శ్రీదేవిని ఆవహింపచేయ వలయును. అనంతరము భక్తితో పాద్యాద్యుపచారముల నాచరించి ఆవరణపూజ చేయవలయును. ప్రతిదినమును ఆవరణపూజ చేయుట కశక్తులైనచో శుక్రవారమునైన ఆవరణార్చన చేయవలయును. శ్రీదేవీ ప్రభాపటలవ్యాప్తమైనట్లుగా త్రైలోక్యమును భావింపవలయును. యథావిధి పూజచేయుచు సహస్రనామములతో కవచసూక్తములతో దేవి అథర్వశిరోమంత్రములతో మహావిద్యా మహామంత్రములతో మాటిమాటికిని జగద్ధాత్రి, శ్రీదేవీ క్షమాపణము కోరుకొనవలయును. నృత్యగీతాదులతో సంతోషపెట్టవలయును. వేద పారాయణములు పురాణవాచనములు ప్రతిపాదింప వలయును. సువాసినీపూజ యొనర్చి దేవీబుద్ధితో బ్రాహ్మణాదుల భుజింపచేసి తన హృదయమునందు మరల శ్రీదెవిని ప్రతిష్ఠితము చేసుకొనవలయును. హృల్లేఖ సర్వమంత్రములకును నాయిక. హృల్లేఖాదర్పణమున శ్రీదేవి నిత్యము ప్రతిబింబించును. శ్రీగురువును పూజించి కృతకృత్యత్వమును పొందవలయును. ఇట్లు పూజించుసాధకుడు దేహాంతమున మణిద్వీపమును పొందును. ఆతడు శ్రీదేవీస్వరూపుడు. దేవతలాతని వందింతురు. అధికారానురూపముగా నాపూజన మొనర్పుము. నీకు కృతార్థత్వము కలుగును.

ఈ శ్రీదేవీగీతాశాస్త్రమును అభక్తునకు అశిష్యునకు ధూర్తునకును జెప్పరాదు. అనర్హునకు దీని ప్రకాశముచేయుట

మాతృవక్షోజోద్ఘాటనమగును. భక్తుడు శిష్యుడు జ్యేష్ఠ పుత్రుడు సుశీలుడు సువేషుడు శ్రీదేవి భక్తిభరితాంతరంగుడు ఈగీతోపదేశాధికారి. ఇట్లుపదేశించి శ్రీదేవి యచటనే యంత ర్హితురాలయినది. దేవీ దర్శనమున దేవతలందరును అపార ముదమును వహించినారు.

యత్రాస్తి భోగో న చ తత్ర మోక్షః
యత్రాస్తి మోక్షో న చ తత్ర భోగః
శ్రీసుందరీసేవనతత్పరాణాం
భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ॥

శ్రీదేవీసముపాసనమె మానవునకు సంసారసాగర తరణోపాయము. శ్రీతత్వము బ్రహ్మతత్వము నొకటి. చక్కని యర్హత కలిగినప్పుడె శ్రీఉపాసనామతి యుదయించును. శక్తివిలాసమును ప్రతిపాదించు గ్రంథము లనేకములున్నవి. వానివలన విషయమును దెలియుట ఉచితము. శక్త్యుపాసనము దేశ దేశాంతరములందు వ్యాపించియున్నది. యోగ్యసంప్ర దాయములందే శ్రీ ఉపదేశమును పొందవలయును. అట్టి సంప్రదాయము భారతభూమియందె నిలచియున్నది. అర్హు డైన ఉత్తమకళ్యాణదేశికుని సన్నిధానమున శ్రీముఖ మంత్రరాజమును గ్రహించి సాధకుడు చక్కగా జపింపవల యును. దీక్ష శ్రీవినయసంపాదకము. దీక్షాపవిత్రుడైన సాధ కుడు శ్రీప్రకాశము ననుభూతిలో తెలియగలడు. దేవ్యర్చ నము నానావిధములనున్నను దక్షిణాచార పద్ధతియందే

శ్రీ

సాధకు డభిలాషగలవాడు కావలయును. అప్పుడాతనికి చక్ర తత్వము గోచరముకాగలదు. శ్రీదీక్షాపవిత్రతవలన సాధకుడు తనదేహమునె చక్రముగాభావించి అంతర్యాగ మొనరించును. అదియె తరణోపాయము.

విష్ణుమాయాస్వరూపిణియగు శ్రీదేవి సర్వభూతములందును చేతన యనబడుచున్నది. ఆ చేతన శ్రీజగమంతయు నిండియున్నది. బుద్ధి, నిద్ర, క్షుధ, ఛాయ, శక్తి, తృష్ణ, క్షాంతి, జాతి, లజ్జా, శాంతి, శ్రద్ధా, కాంతి, లక్ష్మి, వృత్తి, స్మృతి, దయ, తుష్టి, మాతృ, భ్రాంతిరూపములతో ప్రకాశించుచున్నది. ఆయా స్వరూపముల నారాధించుట శ్రీదేవి నారాధించినట్లై యగును. దయాసత్యశౌచాదులు లేక ఎంతగా పూజలనొనర్చినను ఫలములేదు. కావున సాధకుడు సత్య దయాశక్తి బుద్ధిజాత్యాదిభావముతోనుండు శ్రీశక్తినారాధింపవలయును. ప్రపంచగతి ప్రసారము పొందుచున్న మానవుడు ప్రపంచ ధర్మస్వరూపముననున్న శ్రీదేవి నారాధించి ధన్యుడగును.

శ్రీదేవీమాత్మనా ధ్యాయే స్వపరిస్పందసుందరీం
కళ్యాణాంకవచోముద్రాకలాభావాస్పదాంపరాం॥
శ్రీదేవీపరిచింతయా మనసిజప్రధ్వంసిరూపో హరః
పూర్ణాత్మా సతతం విభావ్యత ఇతి శ్రీం మాం సదా భావయే
యేనోత్తుంగతరంగరంగదఖినాభావా మదీయం మనః
తత్వే సంగ్రహలాలసం పరిలసద్వాచావిభూషాస్పదం॥

శ్రీ

బ్రహ్మీభావమఖండమాద్యమఖిలం శబ్దాఖ్యమూర్జస్వలం
ప్రఖ్యోపాఖ్యవిధావిభావితమహం యంత్రాత్మతామాగతం
దేవీరూపముపాత్తరాసమబుధాహంకారనాశాత్మకం
కళ్యాణం గురుమాత్మనీనమనిశం స్వాభిన్నమారాధయే॥

శ్రీదేవీం మనసా విభావ్యనిరతం సోహం సముద్యోగవాన్
దేవీరూపమఖండవిశ్వమనిశం ధ్యాయామి దేవీధియా
విశ్వారాధనమాత్మనా కలయితుర్నాస్తి క్షతిః కాపి చే
త్యాప్తోదీరితభారతీమధురతాప్యాత్మశ్రియోల్లాసికా॥

"కళ్యాణ స్తవము"



భారతీ ప్రెస్, తెనాలి.

# శ్రీ మాధవరామ శర్మగారి గ్రంథములు

| సంఖ్య | గ్రంథము | |
|---|---|---|
| ౧ | గీతాసూత్రనవతి | ముద్రితములు |
| ౨ | భక్తితంత్రము | |
| ౩ | శ్రీ | |
| ౪ | శ్రీమాధవగీత | |
| ౫ | మానవయువతి | |
| ౬ | ఉపనిషత్కథామాల | |
| ౭ | తత్త్వసంగ్రహము | |
| ౮ | రాసలీల | |
| ౯ | సాహితీకుంజము | సాహిత్యశాస్త్రము |
| ౧౦ | నవరస గంగాధరము | |
| ౧౧ | వక్రోక్తిజీవితము | |
| ౧౨ | భావప్రకాశనము | |
| ౧౩ | నాట్యసారము | |
| ౧౪ | రసాత్మ | |
| ౧౫ | కావ్యదర్శనము | రచనలో నున్నవి |
| ౧౬ | సాహితీనిష్యందము | |
| ౧౭ | రసభారతి | |
| ౧౮ | ఉపేక్షిక | |

అముద్రితములు ముద్రణముకోరుచున్నవి.